24.9.1993 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 39, విడిప్రతి: రు. 2.00 లు
Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

## తిడితే తిట్టారు, తొందర పడవద్దని పివి సలహా!

# బుజ్జగించే కొద్దీ రెచ్చిపోతున్న ఎమ్మెల్యేలు!

రాష్ట్ర మంత్రి వర్గ విస్తరణ తర్వాత తలెత్తిన అసమ్మతిని మొగ్గలోనే తుంచి వేయాలని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి భావిస్తున్నారు. మంత్రి పదవులు దక్కని కొందరు ఎమ్మెల్యేలు బాహాటంగా విమర్శిస్తూ పత్రికల కెక్కిన వైనాన్ని ముఖ్యమంత్రి ఇటీవలి ఢిల్లీ పర్యటనలో పార్టీ అధ్యక్షుడు పి.వి. నరసింహా రావుకు నివేదించారు. ఎమ్మెల్యేల ప్రకటనలతో పాటు పిసిసి అధ్యక్షుడు మజ్జి తులసీదాస్ చేసిన విమర్శల క్లిప్పింగ్‌లను కూడా ముఖ్యమంత్రి భద్రంగా తీసుకెళ్లి పి.వి.కి చూపించారట. ఎమ్మెల్యేలతో పాటు పార్టీ అధ్యక్షుడి ప్రవర్తన తనకు తలనొప్పిగా తయారైందని, ఇటువంటి ధోరణిని వెంటనే అణచి వేయక పోతే పార్టీకి నష్టం వాటిల్ల గలదని ముఖ్యమంత్రి చెప్పారట. అవసరమైతే వీరి పై క్రమ శిక్షణా చర్యల్ని తీసుకోవాలను కుంటున్నట్లు కోట్ల వారు ప్రధాన మంత్రితో అన్నారట. అందుకు ప్రధాని తలూపక పోగా, "భాస్కరా, తొందర పడవద్దు. మరోసారి వాళ్లందరితో సంప్రదింపులు జరిపి సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకో" అని అనడంతో ముఖ్యమంత్రి డైలమాలో పడ్డారు. ఇప్పటికే ముఖ్యమంత్రి అసంతృప్తిగా వున్న ఎమ్మెల్యేలు కొందరితో నేరుగా మాట్లాడారు. మాజీ మంత్రి చిత్తరంజన్ దాస్‌ను ప్రత్యేకంగా పిలిపించుకొని తొందర పడవద్దు నీకేం కావాలో చెప్పు. పెద్ద కార్పొరేషన్ ఏదైనా తీసుకో అని ముఖ్యమంత్రి బుజ్జగించినప్పటికీ చిత్తరంజన్ వినకుండా పత్రికా సమావేశం పెట్టి ముఖ్యమంత్రి వైఖరిని తీవ్రంగా దుయ్య బట్టాడు. అలాగే మరో మాజీ మంత్రి పంతం పద్మనాభం రాజీనామా చేసినప్పుడు కూడ రెవిన్యూ మంత్రి రామిరెడ్డి, మార్కెటింగ్ మంత్రి సంగీతం వెంకట రెడ్డిని రాయబారానికి పంపి ముఖ్యమంత్రి విఫల యత్నం చేశారు. మరో ఎమ్మెల్యే జక్కంపూడి రామ మోహన రావు ఇటీవల పంతం పద్మనాభం పాల్గొన్న సభకు హాజరవటంతో ముఖ్యమంత్రి కంగారు పడి రామ్మోహన రావును ప్రత్యేక దూత ద్వారా పిలిపించు కొని మరీ బుజ్జగించారు. ముఖ్యమంత్రి ఎన్ని బుజ్జగింపులు చేస్తున్నా ఎవరి ధోరణి వారిదే అన్నట్లు ఎమ్మెల్యేలు బహిరంగంగా రచ్చ చేస్తున్నారు. మాజీ మంత్రి జలగం ప్రసాద రావు అయితే ముఖ్యమంత్రి పై తీవ్రంగా విరుచుక పడటంతో పాటు, దమ్ముంటే తన పై చర్య తీసుకోవాలని సవాలు విసిరారు. ఇటువంటి వారి పై క్రమశిక్షణ చర్య తీసుకునే బదులు తిరిగి సంప్రదింపులు మొదలిడితే ముఖ్యమంత్రిగా తన స్థాయి దిగజారి పోగలదని కోట్ల వారు భావిస్తున్నారు. అయితే పార్టీ అధ్యక్షుడి అభిప్రాయాన్ని మన్నించాలి కాబట్టి కోట్ల వారు బుజ్జగింపుల పర్వానికి తిరిగి శ్రీకారం చుట్టారు.



## జనవరిలో చిరంజీవి ఆరంగేట్రం!



సినీ నటుడు చిరంజీవి తన కొత్త పార్టీ రూపకల్పనకు జనవరిని తగిన సమయంగా నిర్ణయించుకున్నారని నమ్మకంగా తెలుస్తూంది. కాంగ్రెస్ అసమ్మతి నాయకులు, ఆయన్ను పార్టీ పెట్టమని ప్రాణం తోడేస్తున్నారు. కేవలం కాపులకు పరిమితం కాకుండా హరిజన, గిరిజనాది వర్గాలను కలుపు కొని, తమది బలహీన వర్గాల పార్టీ అనే అభిప్రాయం కల్పించాలన్నది వీరి ప్రయత్నం. ఎన్టీఆర్ రెండవ పెళ్లి సంఘటనతో చీదర కలిగిన పలువురు తెలుగుదేశం నాయకులు కూడా చిరంజీవికి ఫలర్లు పంపుతున్నారు. తాను ఒప్పుకొని వున్న సినిమాలు పూర్తయ్యే వరకు రాజకీయాలలోకి రావడం సమంజసం కాదని చిరంజీవి భావన. అందువల్ల జనవరిలోగా కాల్షీట్లు పూర్తి చేసి, అప్పుడు పార్టీ ఏర్పాటు ప్రకటన చేయాలని తలపెడుతున్నారు. ఈలోగా పార్టీ

కొరవ 8 పేజీలో



రంగడి తేరు వంటి అట్టల సౌధంలో పవళించి వున్న సిద్ధి వినాయక స్వామి. (కాపువీధిలో కనువిందు చేస్తున్న దృశ్యం!)

# మళ్లీ విస్తరణ – ముగ్గురికి స్థానం!

ముఖ్యమంత్రి తన మంత్రివర్గంలో మరో ముగ్గుర్ని చేర్చుకోవాలని యోచిస్తున్నారు. కరీంనగర్ జిల్లా నుంచి స్పీకర్ శ్రీపాద రావు, కర్నూలు జిల్లా నుంచి కె.ఇ. కృష్ణమూర్తి, చిత్తూరు జిల్లా నుండి ఒకరిని మంత్రి వర్గంలో చేర్చుకోవచ్చు. శాసన సభలో శ్రీపాద రావు స్పీకర్ స్థానంలో వుండటం కోట్ల వారికి మొదటి నుంచే ఇష్టం లేదు. శ్రీపాద రావును ఆ స్థానం నుంచి తప్పించి శ్రీ పురుషోత్తమ రావును స్పీకర్‌గా చేయాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. అలాగే కర్నూలు జిల్లా నుంచి కె.ఇ.ను మంత్రి వర్గంలో చేర్చుకుంటే బి.సి.ల అసంతృప్తిని చాలా వరకు తగ్గించటమే గాక త్వరలో జరుగనున్న కర్నూలు లోక్ సభ ఎన్నికల్లో తన కుమారుడి విజయానికి దోహద పడగలదని ముఖ్యమంత్రి అనుకుంటున్నారు. అలాగే ముఖ్యమంత్రి వర్గంలో ప్రాతినిధ్యం లభించని చిత్తూరు జిల్లాకు ఆ లోటు తీర్చినట్లు వుతుంది. ఇలా వుండగా పిసిసి అధ్యక్షుడ్ని కూడా మార్చాలని కోట్ల పట్టుదలగా వున్నారు. పిసిసి

పన్నులు పెంచడమేనా..

# పనులు చేయడమేమైనా వుందా?

నెల్లూరు టౌన్ జనాభా మీద ఒక్కసారిగా కోటి 84 లక్షల పన్నుల భారం పడింది. ఇది అసలు బరువు కాదు – అదనపు బరువు. ఇళ్ల పన్నుల పెంపకం ద్వారా ప్రజలకు ప్రభుత్వం చేసిన మహోపకారం ఇది.

మునిసిపాలిటీలకు ఇళ్ల పన్ను ప్రధాన ఆదాయ వనరు. అయితే దీనికి సంబంధించి ఇప్పటి వరకు ఒక శాస్త్రీయమైన విధానం లేదు. ఎప్పుడో చేసిన చట్టం దశాబ్దాల తరబడి మార్పు చేర్పులకు లోనై గందరగోళంగా తయారైంది. చట్టం ఎంత సంక్లిష్టంగా వుంటే, దాన్ని తమ కనుకూలంగా మార్చుకోవడం అధికార్లకంత తేలిక. అందువల్లే లోకువైన ఇళ్ల యజమానులు, పలుకుబడి కలిగిన వారు సిబ్బంది చేతులు తడిపి, ప్రలోభ పెట్టి పన్నులు తగ్గించు కుంటుంటారు. ఏ ఆసరా లేని అమాయకులు వేలకు వేలు కడుతున్నారు. ఇళ్ల సంఖ్య ఎంత పెరిగినా మునిసిపాలిటీ ఆదాయం మాత్రం పెరగదు. ఈ లోపాన్ని సరిదిద్ద డానికే ప్రభుత్వం నూతన పన్నుల విధానం ప్రవేశ పెట్టింది; ఎంతో శాస్త్రీయంగా దీన్ని రూపొందించామని చెప్పారు వారు. కాని తీరా దాన్ని అమలు చేయబోయే సరికి, పన్నులు 450 నుంచి 600 శాతం పెరిగాయి. రాష్ట్రమంతా రచ్చరేగింది. దాన్ని ఉపసంహరించక తప్పలేదు. తర్వాత మార్పు, చేర్పులు చేసి ఇప్పటి విధానాన్ని ప్రకటించారు. చదరపు మీటరును ప్రాతిపదికగా తీసుకొని పన్ను వేయడం ఈ విధానం.

**నెల్లూరు పౌరుల పై నడ్డి విరిగే ఇళ్ల పన్నుల భారం**

నివాస యోగ్యమైన కట్టడాలను దీని ప్రకారం ఆరు వర్గాలుగా విభజించారు. అన్ని సౌకర్యాలూ వున్న భవనాలు, సాధారణ ఇళ్లు, దంతులు, దూలలతో కట్టిన ఇళ్లు, మంగుళూరు పెంకుటిళ్లు, రేకుటిళ్లు, పూరి గుడిసెలు అని విభజించారు. ఒక్కొక్క వర్గానికి ఒక్కొక్క రేటు నిర్ణయించారు. అయితే ఏ ఇంటికీ పాత పన్ను కంటే వంద శాతం మించి పెరగరాదన్న ఆంక్ష వుంది. సంవత్సరానికి 450 రూపాయల లోపు బాడుగ విలువ వుండే చిన్న చిన్న ఇళ్లు, పూరిగుడిసెలు పన్ను కట్టనవ సరం లేదు. అటువంటి ఇళ్ల సంఖ్య నెల్లూరులో 5 వేల 475 అని తేలింది. ట్రంకురోడ్డు వంటి ప్రధాన ప్రాంతాలలో చదరపు మీటరుకు రెండు రూపాయలుగా రేటు నిర్ణయించారు. ఇతర ప్రాంతాలలో రేటు తగ్గుతుంది. ప్రతి ఇంటికీ కొలతలు తీసి, విస్తీర్ణం లెక్క గట్టి, భవనం తీరు వ్రాసుకొని, ఆయా జోనల్లోని రేటు ప్రకారం పన్ను నిర్ణయిస్తారు.

ఇదే ప్రకారం షాపు రూములు, బ్యాంకు భవనాలు, వాణిజ్య సముదాయాలు, సినిమా హాళ్లు, ఫ్యాక్టరీలకు కూడా పన్నులు విధిస్తారు. అంగళ్లకు సంబంధించి ప్రధాన బజార్లు, ప్రక్క లేన్లు, సబ్ లేన్లు అని మూడు వర్గాలు చేసి, మూడు రేట్లు నిర్ణయించారు. ఇప్పటి వరకు న్యాయంగా పన్నులు కట్టిన వారికి కొత్త పన్ను ఎట్టి పరిస్థితులలోనూ వంద శాతం మించి పెరగదని. ఏదో ఒక అడ్డ దారిలో, లోపాయికారి తనంగా పన్నులు తగ్గించుకొని వున్న వారికి మాత్రం 500 శాతం వరకు

**కౌన్సిల్ ఎన్నికల నాటికి కోటికి మించిన మిగులు వుంటే కౌన్సిలర్లు పోయేనాటికి 40 లక్షలు అప్పు మిగిల్చారట-**

పెరిగినట్లు కన్పడుతుందని కమీషనర్ కెప్టెన్ కెవి రెడ్డి చెప్తున్నారు.

మొత్తం మీద చూస్తే ఇళ్ల మీద 90 శాతం, నివాసేతర భవనాల పై 98.7 శాతం, సినిమా హాళ్ల పైన 126 శాతం పన్నులు పెరిగాయి. అన్ని రకాల పన్నులు ఇది వరకు కోటి 97 లక్షల 14 వేలుగా వుంటే ఇప్పుడు 3 కోట్ల 8 లక్షల 78 వేలకు పెరిగింది. పెరుగుదల శాతం 93.2; పెరిగిన మొత్తం కోటి 84 లక్షలు. వర్గాల వారీగా పెరుగుదల వివరమిదీ–

| | పాతవి లక్షలు | కొత్తవి లక్షలు | పెరిగిన శాతం |
|---|---|---|---|
| ఇళ్లు | 90.78 | 172.44 | 90 |
| షాపులు | 22.53 | 45.10 | 100 |
| ఆఫీసులు/ బ్యాంకులు | 7.18 | 14.38 | 100 |
| సర్వింగ్ హోంలు | 5.83 | 10.09 | 71 |
| విద్యా సంస్థలు | 0.70 | 0.96 | 36 |
| హోటళ్లు/రెస్టారెంట్లు/ లాడ్జిలు | 4.34 | 8.49 | 93 |

**న్యాయంగా పన్ను కడుతుండిన వారికి నూరు శాతం మించి పెరగడం లేదు; లోపాయికారీ పనులు చేసిన వారికి ఐదింతల అపరాధం!**

కొరవ 8 పేజీలో

# జమీన్‌రైతు
## నిరాశ వద్దు

శ్రీహరికోట రాకెట్ కేంద్రం నుంచి ప్రయోగించిన పిఎస్ఎల్‌వి రాకెట్ విఫలమైంది. మొదటి రెండు దశలలో చెప్పిన మాట విన్న ఈ రోదసీ నౌక, మూడవ దశలో ఏమి లోపం జరిగిందో కాని, శాస్త్రవేత్తల హితులను ధిక్కరించి, దారి తప్పి, పైకెగరలేక, నిప్పులు కక్కుకుంటూ నేలరాలి పోయింది. శ్రీలంక ప్రాంతంలో ఎక్కడో బంగాళాఖాతంలో నిమజ్జనమైంది.

ఈ రాకెట్ ప్రయోగం పై ఇటు శాస్త్రవేత్తలు, అటు ప్రజలు కూడా ఎంతో ఆత్రుతతో, ఆశతో ఎదురుచూశారు. ఇది విజయ వంతమై వుంటే, భారీ ఉపగ్రహాలను అంతరిక్షానికి పంపగల్గిన ఆరవ దేశంగా భారత్‌కు సమున్నత గౌరవం లభించి వుండేది. అమెరికా, రష్యాలతో సమానంగా ఖండాంతర క్షిపణుల తయారీ పరిజ్ఞానం స్వంతమై వుండేది.

పన్నెండేళ్ల సుదీర్ఘ కృషి తర్వాత జరిగిన ఈ ప్రయోగం ఇట్లా విఫలం కావటం ఆశాభంగం కల్గించినప్పటికీ, దానితో నిరుత్సాహ పడవలసిన అవసరం లేదు. పిఎస్ఎల్‌వి సంక్లిష్టమైన సాంకేతిక పరిజ్ఞానంతో కూడుకున్నది. కేవలం ఐదు దేశాలు మాత్రమే ఈ సమర్థత కల్గి వున్నాయంటేనే దాని గొప్ప తనం అర్థం చేసుకోవచ్చు. అంతటి క్లిష్టమైన ప్రాజెక్టులు రూపకల్పన చేసేటప్పుడు కొన్నిలోపాలు, వైఫల్యాలు సహజం. అంతరిక్ష శాస్త్రంలో తిరుగులేని పరిజ్ఞానం కల్గిన అమెరికా కూడా ఎన్నో వైఫల్యాలు చవిచూచింది. ఇప్పుడున్న సాంకేతిక ఔన్నత్య దశకు రావడానికి అమెరికాకు కాని, రష్యాకు కాని దాదాపు మూడు దశాబ్దాల సుదీర్ఘ సమయం పట్టింది; కొన్ని కోట్లు వ్యయమైనాయి. ఆ దృష్టితో చూసినప్పుడు పిఎస్ఎల్‌వి రాకెట్ వైఫల్యం నిరాశ చెందాల్సిన విషయమే కాదు. దానికైన 450 కోట్ల వ్యయం కూడా లెక్కలోనిది కాదు. సమాచార, టెలివిజన్ ప్రసార అవసరాల కోసం విదేశీ రాకెట్ల ద్వారా పంపే మన ఉపగ్రహాలకు చెల్లిస్తున్న వ్యయంతో పోలిస్తే ఇది చాలా తక్కువ. మరుసటి ప్రయోగంలో మనం విజయం సాధించ గల్గితే, పెక్కు వర్ధమాన దేశాలు తమ ఉపగ్రహాల అవసరాల కోసం మన రాకెట్‌ను వాడుకోవడానికి సిద్ధంగా వున్నాయి. దాని ద్వారా ఇరవయ్యేళ్లలో అంతరిక్ష పరిశోధనకు పెట్టిన మొత్తం పెట్టుబడి రెండేళ్లలో తిరిగి సంపాదించు కోవచ్చు. ఏడాది తిరిగేలోగా రెండవ పిఎస్ఎల్‌విని రోదసీకి పంపుతామని ఇస్రో ఛైర్మన్ శ్రీ యు.ఆర్. రావు ప్రకటించారు. ఆ కల నిజం కావాలని ఆశిద్దాం!

## జనతా ఐక్యత

చీలికలు, పేలికలైన జనతాదళ్‌ను అతికించి, ఐక్యంగా వున్నట్లు ప్రజలను నమ్మించడానికి ప్రయత్న మారంభమైంది. మిని జనరల్ ఎన్నికల వలె జరుగనున్న నాలుగు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలో బిజెపి ప్రభంజనానికి అడ్డుకట్ట వేసే విఫల యత్నం ఇది. విపిసింగ్ జనతాదళ్, అజిత్ సింగ్ జనతాదళ్ (ఎ), చంద్రశేఖర్ సమాజవాది జనతా పార్టీలు ఒక గొడుగు క్రింద చేరడానికి సమ్మతించాయి. జాట్‌ల ప్రాబల్యం వున్న ఉత్తర ప్రదేశ్‌లో అజిత్ సింగ్‌తో ఇతర జనతా ముక్కలు చేతులు కల్పడం కొంత ప్రభావం కల్గించే మాట నిజమే. కాని బిజెపిని ప్రతిఘటించడానికి ఆ బలం చాలదు. మైనారిటీల రక్షకుడుగా కీర్తింపబడుతున్న ములాయం సింగ్ యాదవ్ వీరితో కలవడం లేదు. బలహీన వర్గాలలో పేరు ప్రఖ్యాతులున్న కన్షీరాం సైతం దూరంగా వున్నారు. యాదవ్ సహకారం పొందలేకుంటే జనతాదళ్ ప్రజలను ఆకర్షించలేదు; జనతాతోనో, కాంగ్రెస్‌తోనో కలసి నడవకుంటే యాదవ్ బలం నిర్వీర్యమౌతుంది. అతనొక్కడే ఒక శక్తిగా బిజెపిని ఎదిరించలేరు. పైగా అతడు చీల్చే ఓట్లు బిజెపి విజయావకాశాలను పెంచే ప్రమాదం వుంది. ఈ పరిస్థితులలో మూడొంతుల భాగం జరిగిన జనతా ఐక్యత, యాదవ్‌ను వప్పించడం ద్వారా పూర్తి చేసుకోగల్గితే ఎన్నికలలో ప్రజలకు మేలు జరుగుతుంది.

అయితే అధికార దాహంతో, వ్యక్తిగత అహంభావంతో ప్రవర్తించే విపిసింగ్, దేవీలాల్, చంద్రశేఖర్, అజిత్‌సింగ్‌లు ఒక త్రాటి మీద నడవడం సాధ్యమా అన్నది ప్రశ్న. ఒకటికి రెండు సార్లు వీరికి అధికారం ఇచ్చి, చీలికల చేదు అనుభవాలను చవి చూచిన ప్రజలు వారి ఐక్యతా నాటకాన్ని నమ్ముతారా? నమ్మి ఓట్లు వేస్తారా? అనుమానమే. ప్రజల వరకు ఎందుకు, తమ ఐక్యత ఎన్నికల తర్వాత కూడా కొనసాగుతుందని ఈ నలుగురు నాయకులలోనైనా విశ్వాసం వుందా అన్నది సందేహమే.

ఐతే, ప్రచండ మారుతం వంటి ప్రజాభిమానంతో ఎన్నికల రణరంగంలోకి దూకి, తొడతట్టి, సై అంటున్న బిజెపిని నిలువ రించాలంటే ఒక్క జనతాదళ్ కాదు – సమస్త సెక్యులర్ శక్తులూ ఐక్యం కావలసిన అవసరం వుంది. కాంగ్రెస్‌తో సహా ఏ పార్టీకి బిజెపి రామాస్త్రాన్ని పరిహరించే శక్తియుక్తులు లేవు. ఈ వాస్తవాన్ని మనసులో పెట్టుకొని, వ్యక్తిగత అహంకారాన్ని అదుపు చేసుకొని, సంయమనంతో ప్రవర్తిస్తే ప్రజలు హర్షిస్తారు; లౌకిక రాజ్యాంగ వ్యవస్థ రక్షింప బడుతుంది.

# జమీన్‌రైతు

24.9.1943

4 పేజీలు 0-1-6 అణా!

### బెంగాల్ క్షుద్బాధ!

ఒక్క కలకత్తా నగరంలోనే ఆగస్టు 1 నుండి, సెప్టెంబర్ 15వరకు, అంటే 45రోజులలో 2107మంది క్షుద్బాధా ఫలితంగా నడివీధులలో నిండు ప్రాణాలను నిలువునా కోల్పోయారు. వీరు గాక ప్రభుత్వ దృష్టికి రాకుండా బ్రిటిష్ సామ్రాజ్యంలో రెండవ పెద్దపట్టణమైన కలకత్తాలో యింకెందరు మరణించి యున్నారో ఊహించలేము అని స్టేట్స్‌మన్ పత్రిక వ్యాఖ్యానించింది. 15తేది నుంచి, రోజుకు సగటున 50అనాధ ప్రేత సంస్కారాలు నగరంలోనే జరుగుతూ వున్నాయి. ఇతర పట్టణాలు, పల్లెలలోని మరణాల సంఖ్య ప్రకటింప బడలేదుగానీ, బెంగాల్ రాష్ట్ర మంతా యీ "డొక్కల కరువు" తీవ్రంగానే వ్యాపించింది.

### జన్నవాడ క్షేత్రం

నేను యాత్రార్థిని, చాలాదినాలు నుండి గమనించిన విషయాలు నివేదిస్తున్నాను. నాకు ఎవరిమీదా ప్రత్యేకాభిమానాలు గాని, వ్యక్తి ద్వేషాలు గాని లేవు. కావున ట్రస్టీలు అవి సవరించ గలిగితే పవిత్రవంతమైన పుణ్యస్థలము బాగుపడుతుంది. అంతే నా అభిలాష:-

సుభిక్షంగా తినవలసిన అమ్మవారికి పురుగుల అన్నం నివేదన జరుగుతున్నది. బీడితాగిన చేత్తోనే అమ్మణ్ణికి వంట. నిరాహారి, పవనప ర్ణాంబుభక్షుడు, ఫలాహారిగా వున్న మాజీ ఋషిపుంగవుడైన అవధూత గారు నేడు పూలరంగడైనాడు. షడ్ర సోపేత భోజనం, ఇస్త్రీచొక్కాల ధారణం, ఈశ్వరమ్మ పూజ,అబ్బెబ్బే!!

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

ఏం బాగుండలేదండి. పరాయి చోట నుండి వచ్చిన స్త్రీలకు సంవత్సరాల కొద్ది అమ్మవారి సేవనమేమిటి? అట్టి వారికి మేనకూరి వారి సత్రనివాస మేమిటి? ఆ క్షేత్రంలో జరిగే ఛండాలాలు చూస్తుంటే యాత్రికుల కెట్లా భక్తి గుదురుతుంది చెప్పండి?ఒక మాట మరిచాను. యీ మధ్య సందిగం రామకృష్ణయ్య తాలూకా సొత్తులు గూడా కొన్ని చోర గ్రస్తమైనవి. కావలి వారుండేమి లాభం? బలరామిరెడ్డి గారు! ఏది ఎట్లున్నా పవిత్రమైన అమ్మవారి సాన్నిధ్యంలో అవినీతికి అస్కారం లేకుండా చేయండి.

– ఒక యాత్రికుడు

### నెల్లూరు వార్తలు

సుదర్శనమ్మ టిబిస్ కటకు తిక్కవరపు రామిరెడ్డి గారు 4000 లు భవన నిర్మాణాని కిచ్చిరి. శంఖుస్థాపన శ్రీ రామిరెడ్డి గారి చేతనే జరుపబడెను. మందిరం నిర్మింప బడుచున్నది.

* * *

శ్రీ కస్తూరి దేవి విద్యాలయ కమిటీ సమావేశం 29.8.43 తేదిన జరిగినది. హై స్కూలు నిర్మాణ ప్రయత్నానికి (1) తిక్కవరపు రామిరెడ్డి, (2) రేబాల పట్టాభి రామి రెడ్డి, (3) ఏనుగ రాఘవ రెడ్డి గార్లను ఒక కమిటీగా వేసిరి.

విద్యాలయానికి దర్గామిట్టల వుండే వెంకట్రామయ్యరు బంగాళా తీసుకుందామనే వూహలో చూస్తున్నారు. 17 యకరాల స్థలము, కట్టిన బిల్డింగు సిద్ధంగా వుంది.

## గరిమెళ్లను ఇప్పుడైనా గౌరవిస్తారా?

తన గీతాల ద్వారా తెల్ల దొరలను ఉలిక్కి పడేట్టు చేసి, తెలుగు సాహిత్యానికి అమూల్యమైన సేవజేసి,చివరకు దుర్భర దారిద్ర్యంతో, దిక్కులేని స్థితిలో మరణించిన ప్రజాకవి 'గరిమెళ్ళ సత్యనారాయణ' శత జయంతి సంవత్సర మిది. గరిమెళ్ల ఇతర రచనలు ఒక ఎత్తయితే- 'మా కొద్దీ తెల్లదొర తనము' అన్న 39 చరణాలు గల గేయం ఒక్కటే మరొక ఎత్తు. ఆయన రచించిన 'స్వరాజ్యగీతాలు' సంకలనం నాటి ఆంధ్ర దేశంలో పెను దుమారాలు సృష్టించింది. రెండేళ్ల కఠిన కారాగార శిక్ష బహుమానంగా ఇచ్చింది. భారత హృదయాలు, తల్లి కోట(నాటకం), అర్థ సర్వస్వము తెలుగు తల్లికి గరిమెళ్ల సమర్పించిన కంఠా భరణాలు. వేదాంత భావాలను, సామ్యవాద భావాలను కలగలిపి గేయ రచన చేసి నూతన విప్లవానికి నాంది పలికాడు. సంఘసేవ, జాతీయ పోరాటం నమ్ముకొన్న కవిత్వం కోసం సర్వమూ ధార బోసి చివరన జానెడు కడుపు నింపుకునేందుకు జీవన పోరాటం చేసాడు. దీనికి తోడు తల్లి దండ్రులు, భార్య మరణం, కంటిచూపు పోవడం ఆయన్ను కృంగ దీశాయి. చివరకు మద్రాసు ఈ ధీర హృదయుడు దిక్కులేని చావు చనిపోయాడు. నిజంగా ఆంగ్రత్వం ఇతని పాలిట శాపమేమో; జీవించి వున్నప్పుడు ఎలాగూ ఆకలి చావు పాలయ్యాడు. కనీసం ఇప్పుడైనా ఒక ప్రజాకవిగా, స్వాతంత్ర్య సమర యోధుడైన గరిమెళ్లను ఆంధ్రదేశం గౌరవిస్తుందా? శత జయంతి ఉత్సవాలను జరిపేందుకు ప్రభుత్వం ముందుకు వస్తుందా? వేచి చూడాలి.

–ధనొట్టి లెనిన్ నాయుడు

నాయుడుపేట

## జనవాణి

## ఆడపడుచులారా – బుద్ధి చెప్పండి!

వ్యసనాన్ని బట్టి వ్యక్తుల, వ్యక్తిత్వాలు అంచనా కట్టలేము. బలహీనతలు వ్యక్తిత్వపు ముసుగులో వుండాలి. చీకటి తెరల్లో కోరికలు నిక్షిప్తం చేసుకోవాలి. 72 ఏళ్ల వయోభారంతో, బాహువుల్లో బలం సన్నగిల్లిన మన రాష్ట్ర ప్రతిపక్ష నాయకుడు కిష్కింధ కాండలో వానర విన్యాసాలను గుర్తు చేయడం సిగ్గు చేటు. ఈ నాయకుడు కాషాయం కట్టి సన్యసించడం ఏమిటి? ధవళ వస్త్రాలలో శోభనం నాటి పెళ్లి ముచ్చట్లు ఏమిటి? నిజంగా ఈ మహామహుని జీవిత చరిత్ర అధ్యయనం అరువ్వర కోట్ల ఆంధ్రులకు అవసరమా; ఆలోచించండి. వయోభారంలో నడుం వంగిన ముదుసలికి చేతి కర్ర కావాలి తప్ప – ఆడపిల్ల చేయి అవసరం అని చెప్పడం విడ్డూరం కాక మరేమిటి? ఆడపడుచులారా హారిత, చందన, ధూప కేళికలతో ఇంత వరకూ హారతిచ్చారు. ఇకనైనా ఈ మేక వన్నె పులి అసలు రూపం చూసి తగిన బుద్ధి చెప్పండి.

–వేల్పుల కామయ్య

బుచ్చిరెడ్డిపాళెం

(తరువ 11 వ పేజిలో)

# నెల్లూరు మాండలికాల తుఫాన్ పులుగుండ్ల రామకృష్ణయ్య

మానవ స్వభావం రెండు రకాలుగా వుంటుంది. ఒకటి వృత్తి, రెండవది ప్రవృత్తి. కొందరు రచనయే వృత్తిగా కలవారైతే మరి కొందరు రచన ప్రవృత్తిగా గల్గి వృత్తిలో వేరుగా కన్పిస్తారు. కాని మన రామకృష్ణయ్య గారు వృత్తి, ప్రవృత్తి

> కన్యాశుల్కం గిరీశం వలె తుఫాన్ రాఘవ రెడ్డి నాటక చరిత్రలో చిరస్థాయిగా నిల్చి పోతాడు; సామాజిక సమస్యలకు అయన నాటకాలు నిలువుటద్దం పట్టాయి!

రెండింటిలో ఒకే విధంగా కనిపించడం విశేషం. వారిలో రచనా వ్యాసంగం తప్ప మరో వృత్తి, ప్రవృత్తులు లేవు. కావ్య శిల్పంలో నాటక రచన పరమావధి యని అభిజ్ఞుల మతం "నాటకాన్తం హి సాహిత్యం" అనే మళ్ళీ సాహిత్యంలో నాటకానికుండే ప్రాముఖ్యాన్ని సూచిస్తుంది. అట్టి సాహిత్యాభిరుచి, విశాల దృక్పథం, అనుభవ భిరావి కల్గి వుండడంతో పాటు నిత్య జీవితాన్ని నటనా సాహిత్యాలలో గడిపి అనేక నాటక ప్రక్రియలు చేపట్టారు రామకృష్ణయ్య గారు.

శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్య గారు నెల్లూరు జిల్లా దర్శిల మిట్ట బంగ్రిగ గ్రామవాసులు. వీరిది పండిత వంశం. వ్యవసాయంలోనూ గాక సాహిత్య వ్యవసాయంలో ఆరితేరిన కుటుంబం. వీరు 5.5.1911 లో జన్మించారు. తండ్రి కోటయ్య గారు గొప్ప సంగీత విద్యాంసులు. "పులి కడుపున మేక పుట్టదు" గదా అన్నట్లు రామకృష్ణయ్య గారు కూడ ఆ కళలోనే వివిధ రంగాలలో అభివృద్ధి సాధించారు. నెల్లూరు జిల్లా పల్లిపాడులో నాటి గురుకులంగా తీర్చబడ్డ తిలక్ విప్ర విద్యాలయంలో సంస్కృతాన్ని అభ్యసించి, తర్వాత వెంకట గిరి రాజా హై స్కూలులో (V.R.H.S.) చదివారు. వీరి కళాపిపాసకు తగినట్లుగా వీరు మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారి వియ్యంకు లైనారు. నెల్లూరు ఆంధ్ర సభ కార్యనిర్వాహక సభ్యులుగా, కార్యదర్శిగా పనిచేశారు. వీరి కలం నుండి నాటకాలు, కథానికలు, గేయాలు వెలువడ్డాయి. అర్ధ శతాబ్దికి మించి నాటక సాహిత్య వ్యాసంగంలో, నటనలో చెయ్యి తిరిగిన వారు. తుఫాన్, తలవని తలంపు, విముక్తి, వాపస్, శకుంతల, గాంధీ బాల్యం అనే నాటకాలు వ్రాశారు. మధిగుండం, వాలో మాట మొదలైన కథానికలు, దిష్టి బొమ్మలు, స్వగతం, ఉగాది మున్నగు గేయాలు వీరి కలం నుండి వెలువడ్డాయి.

స్త్రీ పాత్ర పోషణయే ఆయన నట జీవితానికి నాంది. విద్యార్థి దశలోనే వారు లవకుశ లోని సీతాదేవి పాత్ర వేసారు. కన్యాశుల్కంలో కరటక శాస్త్రిగా, తులాభారంలో సత్యభామగా, వాల్మీకిలో మోహనాంగిగా, వాగానందంలో మలయ వాణిగా, నాటక



రంగానికి వారు సుపరిచితులు. బొబ్బిలి, ప్రతాప రుద్రీయాది నాటకాలలో నటనా ప్రాముఖ్యం సముపార్జించిన కళాధౌరేయులు. తిక్కవరపు మీనమ్మ గారి హరిజన బాలికల హాస్టలులో ఆర్ట్స్ క్రాఫ్ట్స్ విభాగంలో ఒక దశాబ్దం ఆర్ట్స్ సంచాలకులుగా పనిచేశారు. విద్యార్థులలో సంగీత నృత్య నాటకాభిరుచిని కల్గించి వారిచే ప్రదర్శన లిప్పించారు. వారు స్థాపించిన ఒక నాటక సమాజం రజతోత్సవం జరుపుకొంది. నెల్లూరు తెలుగు పలుకుబడ్లతో నాటక శిల్పాన్ని మలచిన అపర విశ్వకర్మ. వారి విమర్శనా దృష్టి విహంగ వీక్షణం వంటిది. వీరి నాటకాలు రాశిలో చిన్నవయినా, వాసిలో మిన్నవి.

క్రీ.శ. 19 వ శతాబ్ది ఉత్తరార్థమున గాని తెలుగు నాటక రచన ప్రారంభం కాలేదు. ఆంధ్ర నాటక రచయితలలో కోరాడ రామచంద్ర శాస్త్రి గారు మొదటి వారని చెప్పవలసి యుంది. వీరు మంజీర మధుకరీయమనే నాటకం వ్రాశారు. అయితే ఇది రంగస్థల ప్రదర్శన కాకపోవడం వల్ల అంత ప్రచారానికి రాలేదేమో అనిపిస్తుంది.

క్రీ.శ. 1861 సం. లో వామనభట్టు జోషి అను వారి పెత్తనంలో ఆంధ్రదేశ మంతటా ధార్వాడ కంపెనీ అనే మహారాష్ట్ర నాటక సమాజం సంచారం చేసింది. వారి నాటక ప్రదర్శనలు చూచి తెలుగు వారు కూడా నాటక ప్రదర్శనలకు పూనుకొన్నారు. ఆనాడు చాంగ్లీ కంపెనీ కూడ నాటక ప్రదర్శనలిచ్చేరి. తెలుగులో అనాటికి వీరేశలింగం పంతులు గారు తమ శాకుంతల నాటకాన్ని ధార్వాడ కంపెనీ తరఫున వేయించారు. పంతులు గారు నాటక ప్రదర్శన ప్రభావాల్ని గుర్తించి సంఘ సంస్కరణాను గుణంగా ప్రహసన రచనలు చేశారు. ఇంచుమించు ఇదే సమయంలో గురజాడ వారి కన్యాశుల్కం బయలు దేరింది. ధార్వాడ వారి ఆగమనంతో మన [illegible] రంగం విస్తృత మయింది. ఆంధ్రదేశంలో పలు నాటక సమాజాలు ఏర్పడ్డాయి. బళ్లారి రాఘవ మున్నగు నాటక సాహిత్య వేత్తలు ఆంధ్రదేశంలో [illegible] నాటక ప్రదర్శన లిచ్చారు.

> డాక్టర్ ఉడాలి నరశింహ శాస్త్రి
> యం.ఎ. పి.హెచ్.డి

ధర్మవరం వారి చిత్రనళీయం, వేదం వారి ప్రతాప రుద్రీయాది తెలుగు నాటకాలు తెలుగు నాటక ప్రదర్శనలో మైలు రాళ్లు. నెల్లూరులో పలు నాటక సమాజా లేర్పడ్డాయి. జాతీయోద్యమ ప్రభావంగా వర విక్రయం, బొబ్బిలి వంటి సాంఘిక చారిత్రక నాటకాదులు వెలిసాయి.

రామకృష్ణయ్య గారి తుఫాన్ నాటకం జగత్ప్రసిద్ధమైంది. ఆకాశవాణి,

కొరవ 10 పేజిలో

# వెంకయ్య స్వామి టెలి ఫిలిం రెడీ!

ఎస్.వి.ఎస్. ఆర్ట్ క్రియేషన్స్ బేనర్ పై శ్రీమతి టి. సుజాత సమర్పణలో యువ నిర్మాత నెల్లూరీయుడు టి.వి. సుబ్బారావు నిర్మించిన టెలీ ఫిలిం భగవాన్ శ్రీ వెంకయ్య స్వామి చిత్రం పూర్తయింది. గొలగమూడి, వాగులవెల్లటూరు, దొమశిల, గాలిపాలెం, తలుపూరు, మైపాడు, నెల్లూరులలో వివిధ ప్రాంతాల్లో అవసరమైన సన్నివేశాలను చిత్రీకరించారు. రెండు లక్షలకు పైగా ఖర్చయిన ఈ ఫిలిం రెండు గంటల నిడివి కలిగి వుంటుంది. డి.వి. స్వామి, ఎస్.ఎమ్. సుబ్రహ్మణ్యం, అబ్బయ్య, సువర్ణ కుమారి, విజయలక్ష్మి నటించగా బతి ఫేం తాతాజీ దర్శకత్వం వహించారు. ఈ టెలిప్లే క్యాసెట్లు అక్టోబర్ నెలలో విడుదల చేస్తున్నట్లు నిర్మాత టి.వి. సుబ్బారావు చెప్పారు.

## నెల్లూరు సంగతులు

### వ్యాస జయంతి

సాహిత్య సదస్సు యాజమాన్యంలో 25 తేది టౌన్‌హాలు రీడింగు రూంలో వ్యాస జయంతి జరుగుతుంది. శ్రీ స్వయంపాకుల వెంకట శేష శాస్త్రి స్మృత్యంకంగా వారి కుమారులు స్వయంపాకుల శ్రీనివాసులు జరిపే ఈ సభకు సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షత వహిస్తారు. కళా ప్రపూర్ణ శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డి, డాక్టర్ పి. మధుసూదన శాస్త్రి, కొమాండూరి శేషాద్రి పాల్గొంటారు. సాహితీ అభిమానులు తరలి రమ్మని సదస్సు అధ్యక్షులు గోసుకొండ వెంకట సుబ్బయ్య గారు కోరుతున్నారు.

### చక్కెర ఫ్యాక్టరీ రైతు సదస్సు

కోవూరు సహకార పంచదార కర్మాగారం పాలక వర్గం విజయవంతంగా తమ కాలాన్ని పూర్తి చేసుకొన్న సందర్భాన పంచవర్ష ప్రగతి పేరుతో 27 తేది రైతు సదస్సు నిర్వహిస్తున్నది. కర్మాగారం ఆవరణంలో జరిగే సదస్సులో రాష్ట్ర చక్కెర మంత్రి పి. సాంబశివ రాజు, సహకార మంత్రి కె. యానాదిరెడ్డి, గృహ నిర్మాణ శాఖ మంత్రి పి. పెంచలయ్య పాల్గొంటారని ఛైర్మన్ సామంతు సుబ్బారెడ్డి తెలిపారు.

కొరవ 11 వ పేజిలో



# సణుగుడు

* యానాదిరెడ్డి గారికి జ్ఞానోదయం
* అధికారులు అడకత్తెరలో చిక్కారు
* సివి అలుక మానునా?

యానాది రెడ్డి గారికి జ్ఞానోదయం కల్గింది; హైదరాబాదు, నెల్లూరుల మధ్య ఏ బోధి వృక్షం నీడ పైన పడిందో కాని మనిషి మారి పోయాడు; మనసూ మార్చుకున్నాడు.

మంత్రి అయిన హుషారులో యానాది రెడ్డి గారు జిల్లా అంతా దున్నేయాలని తహతహ లాడాడు. ముఖ్యమంత్రి మాటలూ అట్లానే వుండినాయి. రేపు పదకొండు సీట్లు గెల్పించుకొని వచ్చే బాధ్యత కూడా నీదేనని చెప్పారట - మంత్రిత్వం కాగితం చేతికిస్తూ! దానితో జిల్లా పవరు పట్టా తన వశమైనట్లే ఫీలై పోయాడు. నెల్లూరుకు వచ్చే వరకు ఆ స్పీడు అట్లానే సాగింది. మధ్యలో ఏమైందో ఏమో నీటా పడి పోయాడు. నేను ఎమ్మెల్యేగా వున్నంత కాలం కావలికి ఏ మంత్రి రావాలన్నా నా పర్మిషన్ లేకుండా రావడానికి లేదని అంక్షలు [illegible] వాడిని కదా - ఇప్పుడు [illegible] ఇతర నియోజక వర్గాల్లో [illegible] పెడితే ఆ ఎమ్మెల్యేలు నన్ను కుట్టరా అని రాజా కొడుకు కథలో చీమ మాదిరి తలపోస్తున్నారట. ఇకెందు కొచ్చిన గొడవ, నా కావలి సంగతే నేను చూచుకుంటె పోలేదా అని స్వగతం చెప్పు కొంటున్నాడట.

మంత్రి గారికి అంత త్వరగా జ్ఞానోదయం కల్గడానికి కారణమేమై వుంటుంది చెప్మా? చిలక జోస్యం అడిగి చెప్తాను.

## డోలేంద్ర

యానాది రెడ్డి గారు మంత్రిగా ఒక మంచి పని చేశారు. నెల్లూరుకు వచ్చి రావడంతోటే తనకు రాజకీయ జన్మనిచ్చిన స్వర్గీయ బి.సి. కొండయ్య గారికి శ్రద్ధాంజలి ఘటించి, నవయుగం కార్యాలయం లోని ఆయన పటాన్ని పూలమాలతో అలంకరించారు. ఎప్పుడో చనిపోయిన వ్యక్తిని, అతడు తన కెప్పుడో చేసిన సాయం గుర్తు పెట్టుకొని స్మరించడానికి ఎంతో విశాల హృదయం కావాలి. ఇటువంటి మానవతా విలువలు కల్గి వుండడం అభినందనీయం. కావలికి వెళ్లగానే

కొరవ 7 పేజిలో

పోలీసుల పొగరుబోతు తనం, గ్రామస్తుల దురుసుతనం

# బాలాయపల్లెలో కులాల కార్చిచ్చు!

గోటితో పోయేదాన్ని గొడ్డలి వరకు తేవడమంటారే – అట్లా వుంది బాలాయపల్లి ఘర్షణల తీరు. వెంకటగిరి నియోజక వర్గంలోని ఈ చిన్న గ్రామంలో సవర్ణులకు, హరిజనులకు మధ్య ప్రారంభమైన స్వల్ప బేధాభిప్రాయం కుల సంఘర్షణలకు దారి తీస్తున్నది.

బాలాయపల్లిలో, వెంకటయ్య చౌదరి పెద్ద రైతు; తెలుగుదేశం నాయకుడు; చంద్రబాబుకు ఆప్తుడు. సొసైటీ అధ్యక్షుడు కూడా ఆయనే. చౌదరి తెలుగుదేశ హాయుడే అయినా సౌమ్యుడని, అనవసర వివాదాలలోకి వెళ్లడని పేరుంది. అదే గ్రామంలోని నాగయ్య అనే యువకుడు హరిజనులలో పలుకుబడి సంపాదించాడు. దాన్ని పెంచుకోవడం కోసం హరిజనులు, రైతుల మధ్య ఏర్పడే చిన్న చిన్న తేడాలను పెద్ద మాట పట్టింపులుగా మార్చడంలో కీలక పాత్ర వహించేవాడట. ఏడాది నుంచి ఇద్దరి మధ్య తరచు సమస్యలు తలెత్తుతున్నాయి. ఎంఆర్ఓ జోక్యం కూడా ఒకటి రెండు సార్లు జరిగినట్టుంది.

ఈ నేపథ్యంలో నాగయ్య స్థానిక లెప్రసీ ఆస్పత్రి డాక్టర్‌ను ఏదో విషయంలో వేధించాడట. ఆ డాక్టరు వెంకటయ్య చౌదరికి మొరపెట్టుకున్నాడు. చౌదరి వెంటనే నాగయ్యను పిలిపించి గ్రామ వ్యవహారాలలో ఎక్కువగా తల దూరుస్తున్నావని, డాక్టర్‌ను వేధించడం తప్పని, వైఖరి మార్చుకోకుంటే పరిణామాలు తీవ్రంగా వుంటాయని హెచ్చరించాడట. ఇది జరిగింది 15 తేది.

నాగయ్యకు, శ్రీ కాళహస్తిలోని యంగ్ ఇండియా అనే సంస్థతో సంబంధాలున్నాయి. ఈ సంస్థ ఏమిటో, దాన్ని కార్యకలాపాలేమిటో ప్రపంచానికి పెద్దగా తెలియదు. కాని వారికి విదేశాల నుంచి పెద్ద మొత్తంలో నిధులు వస్తుంటాయని వినికిడి. వారు నాగయ్యకు మద్దతుగా రంగంలోకి దిగారు. తనను వెంకటయ్య చౌదరి కులం పేరుతో తిట్టాడని అత్యాచార నిరోధ చట్టం క్రింద బాలాయపల్లి పోలీసు స్టేషన్‌లో కేసు పెట్టారు. సబిన్స్‌పెక్టర్ చౌదరికి సంబంధించిన ఆరుగురిని అరెస్టు చేసి, లాకప్‌లో పెట్టారు. ఆ సమయంలో వారి వంటి పై బట్టలు వూడదీయడంతో పాటు, మొలత్రాడు కూడా కత్తిరించి దిసమొలతో నిలబెట్టి అవమానించాడట. ఆ సమయంలో యంగ్ ఇండియా కార్యకర్తలు సబిన్స్‌పెక్టర్ ఎదురుగా కూర్చుని ముచ్చట్లు తుండినారట. తమ వారిని అవమానించారన్న ఆగ్రహంతో స్టేషన్ దగ్గరకు పరుగెత్తుక వచ్చిన ప్రజలకు ఈ దృశ్యం కోపం తెప్పించింది. ఆ సంస్థతో సబిన్స్‌పెక్టర్ కుమ్మక్కై తమను అవమానించారని ఆరోపిస్తూ జనం స్టేషన్ పై విరుచుక పడ్డారు. పోలీసులూ వారిని ప్రతిఘటించి, కొట్టి, వూరిలోకి ప్రవేశించి 24 మందిని లాక్కొచ్చి స్టేషన్‌లో పడేశారు. వెంకటగిరి సిఐ ఈ సమయంలోనే వెంకటయ్య చౌదరి కడుపులో కొట్టారట. మెడపట్టి, కొంత దూరంలో లాక్కొని పోయారట. దానితో వూరు రెచ్చి పోయింది. స్టేషన్ పై విరుచుక పడ్డారు. సబిన్స్‌పెక్టర్‌ను నోటికొచ్చినట్లు తిట్టారు. అతనూ హరిజనుడు కావడంతో కులం పేరుతో దూషించారట. చౌదరి కుమారులు స్టేషన్‌లో దూరి యంగ్ ఇండియా కార్యకర్తల పై చేయి చేసుకున్నారట. పరిస్థితి చేయి దాటి పోవడంతో సిఐ శ్రీ పేరయ్య భయపడి పోయి జీపులో పారిపోయారు. సబిన్స్‌పెక్టర్‌ను స్టేషన్‌లోపల గదిలో పెట్టి తాళం వేసి కానిస్టేబిళ్లు రక్షణగా నిలబడ్డారు. గ్రామస్తులు, లాకప్‌లో వున్న తమ వారిని విడిపించుకొని, సబిన్స్‌పెక్టర్‌ను తమకు అప్ప చెప్పాలని గొడవ చేస్తూ రోడ్డు పై బైఠాయించారు. స్టేషన్ పై రాళ్లు రువ్వారు. విషయం తెలిసి గూడూరు సబ్ కలెక్టర్ శ్రీ సునీల్ శర్మ ఆఘమేఘాల మీద బాలాయపల్లె వచ్చారు. నెల్లూరు నుండి అడిషనల్ ఎస్పి వచ్చారు. ఈలోగా ఆ దారిన పోతుండిన మాజీ జిప్రప ఛైర్మన్ శ్రీ

కొరవ 8 పేజీలో

కావలిలో దుర్మార్గం !

# నడివీధిలో కబేళా

కావలిలో కూరగాయలు, చేపలు, మాంసం మార్కెట్లు వేరు వేరుగా వున్నా మునిసిపాలిటీ వుదాసీన వైఖరి వల్ల మళ్లీ కొత్తగా నడివీధిలో మాంసం కొట్లు వెలిసాయి. దీనివల్ల ప్రభుత్వ ఆసుపత్రి దక్షిణం వైపు, మెయిన్ రోడ్డంతా వధించిన జంతువుల పనికి రాని అవశేషాలతో నిండి వుంటున్నది. నడి రోడ్డులోనే అందరూ చూస్తుండగానే వధించడం, వాటి హాహా కారాలకు దారిన వెళ్లే వారు భీతిల్లడం పరిపాటయ్యింది. ఈ కొట్లు వెలిసిన చోటు కూడా పరిశుభ్రమైనది కాదు; ఈ ప్రక్కనే ఒక మురికి గోతుంది, గాలికి లేసిన మట్టి మషానం కూడా మాంసం పై చేరుతుండడంతో అది తిన్న వారు తప్పక వ్యాధి గ్రస్తులవు తున్నారు. ప్రజల సంక్షేమం దృష్ట్యా వీరిపై శానిటరీ ఇన్స్‌పెక్టర్ లేదా స్పెషలాఫీసరైన ఆర్డీవో తగిన చర్య తీసుకోవాల్సి వుంది.

పోలేరమ్మ దేవాలయం, పెద్దతూము, పేట సత్రం సెంటర్లలో వినాయక విగ్రహాలను ప్రతిష్టించారు. పెద్ద ఎత్తున విద్యుత్ దీపాలంకరణలు చేసారు. బస్టాండ్, తూర్పు వీధిల్లో వుట్టి కొట్టే కార్యక్రమంలో ఎమ్మెల్యే

కొరవ 7 పేజీలో

## జిల్లా వార్తలు

### కబేళాకు పోతున్న పశువులు

వర్షాభావ పరిస్థితుల్లో, పశుగ్రాసం కొరవడం వల్ల రాపూరు మండలంలోని పలు గ్రామాల్లోని పశువులను రైతులు కబేళాలకు తెగనమ్ము కొంటున్నారు. మండల పరిధిలోని సైద్దాదుపల్లె, రాపూరెడ్డి పల్లె రాపూరులో నీటి సమస్య కూడా తీవ్రంగా వుంది. ఈ దశలో పశువులు నీటికై అల్లాడి పోవడం పరిపాటయ్యింది. మండల సమావేశంలో యుద్ధ ప్రాతిపదిక నివారణ చర్యలు చేపడుతామని చెప్పడమే గాని చేతల్లో అధికారులు ఏం చేయలేక పోయారు ఈ దశలో ఇప్పటి వరకు రెండు వేలకు పైగా మూగ జీవాలు పక్క రాష్ట్రాల కబేళాలకు తరలి వెళ్లాయి. ఇదే పరిస్థితి మరికొన్ని రోజులు కొనసాగితే నిత్యావసరమైన పాల కోసం పాట్లు తప్పవేమో ననిపిస్తుంది.

### అల్లూరులో వినాయక చవితి

అల్లూరులో వినాయక చవితి పండుగను ఘనంగా జరుపుకున్నారు. పాత బస్టాండ్ తూర్పు వీధి.

# నెల్లూరు నలుమూలల్లో

## విహంగ వీక్షకుడు

### జనార్ధన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 28 తేదీ మద్రాసు మీదుగా నెల్లూరు వస్తున్నారు. తన నియోజక వర్గంలో మిగిలి పోయిన గ్రామాలలో రచ్చ బండ సమావేశాలు జరిపించడం ఈ పర్యటనోద్దేశ్యం. 29, 30 తేదీలలో తక్కిలి గ్రామాలు, 1 తేదీ బాలాయపల్లి పల్లెటూళ్లు సందర్శిస్తారు. అన్ని రాత్రిళ్లు మకాం వాకాడులోనే! 2 తేదీ ఉదయం - నెల్లూరు 9 గంటలకు ఇందిరాభవన్‌లో డిసిసి ఆధ్వర్యాన జరిగే గాంధీ జయంత్యుత్స వాలలో పాల్గొంటారు. మధ్యాహ్నం గూడూరు; లంచ్ వాకాడు; తిరిగి సాయంత్రం 5 గంటలకు గూడూరు, దువ్వూరు రమణమ్మ మహిళా కళాశాల సభ 3 తేదీ ఉదయం మద్రాసు మీదుగా హైదరాబాదు.

### యానాదిరెడ్డి

సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి ఆరు రోజుల జిల్లా పర్యటన అనంతరం 23 తేదీ రాత్రి హైదరాబాదు వెళ్లారు.

### పెంచలయ్య

ఇళ్ల మంత్రి శ్రీ పనబాక పెంచలయ్య 20 తేదీ నుంచి నెల్లూరులోనే వున్నారు. మధ్యలో తిరుపతి వెళ్లి సిఎం స్వామిని దర్శించి వచ్చారు. ఈ రోజు (24 తేదీ) మైదుకూరు వెళ్లారు. రాత్రికి తిరిగి రాక, రేపు, ఎల్లుండి కార్యక్రమాలివి లేవు; 27 తేదీ హైదరాబాదెక్స్ ప్రెస్ ఎక్కుతారు.

### భీమ్ రావు

గిరిజన మంత్రి శ్రీ కె. భీమ్ రావు 24 తేదీ రాత్రి నెల్లూరు వస్తారు; 25 తేదీ మధ్యాహ్నం తిరుమల వెళ్తారు.

### ఇళ్ల స్థలాల మోసం

పడారుపల్లెలో కళ్యాణి వీకర్ సెక్షన్ సంఘానికి ఇళ్ల స్థలం మంజూరైందని, దాన్ని స్వాధీనం చేసుకొని సభ్యులకు పంచడానికి రెవిన్యూ అధికారులకు లంచాలు ఇవ్వాలని అబద్ధాలు చెప్పి కొందరు ప్రముఖులు డబ్బు దండుతున్నారట. అయితే, అసలు ఈ పేరుతో వున్న సంఘానికి ఇళ్ల స్థలం ఇవ్వాలన్న ఆలోచనే తమకు లేదని, ఎవరూ డబ్బులిచ్చి మోసపోవద్దని ఆర్‌డిఓ గారు ప్రకటిస్తున్నారు.

ఆ మోసగాళ్లను ఒక కంట కనిపెట్టి వుండండి!



### జిసి మనుమడికి లండన్ ఛాన్స్

స్వర్గీయ జిసి కొండయ్య మనుమడు, శ్రీ గంగా రామమూర్తి కుమారుడు వినయ్ బాబుకు ఇంగ్లండ్‌లోని రోడ్స్ స్కాలర్‌షిప్ ట్రస్ట్ ఇచ్చే ఫెలిక్స్ స్కాలర్ షిప్



లభించింది. లండన్ లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో లా కోర్సు చదవడాని కిచ్చారు దీన్ని. మన దేశంలో ఈ ఛాన్సు సంపాదించిన ఒకే ఒక ప్రతిభా వంతుడు వినయ్ బాబు. రెండేళ్ల పాటు ఏడాదికి పది లక్షల లెక్కన స్కాలర్ షిప్ లభిస్తుంది. ప్రతిభ చూపితే మూడవ సంవత్సరమూ కొనసాగింప బడుతుంది. ఆంధ్ర నుంచి ఈ స్కాలర్ షిప్ ఇప్పటి వరకు ఎవ్వరికీ లభించలేదు.

తాత మేధస్సు మనుమనికి వారసత్వంగా వచ్చిందన్న మాట.

### సుబేదారుపేట గొడవ

చిన్న గొడవలు రాజకీయ పార్టీల ప్రమేయంతో ఎటువంటి రంగును పులుము కొంటాయన్న దానికి 21 తేదీ సుబేదారుపేటలో జరిగిన సంఘటనను చెప్పవచ్చు. 20 తేదీ రాత్రి సుబేదారు పేట సెంటర్‌లో ఏర్పాటు చేసిన వినాయక విగ్రహం పై వేసిన షామియానా ముందు భాగంలోని టార్పాలిన్ పట్టలు పాక్షికంగా కాలిపోయాయి. ఆది వారం రాత్రి పడిన వర్షం దరిమిలా షార్ట్ సర్క్యూట్ ఆ ప్రమాదానికి కారణం అయి వుండవచ్చని పోలీసులు చెబుతున్నారు. కాని ఈ ఏరియాలో ఇంతకు ముందు నుంచి షమీర్, వినోద్ కుమార్, నగేష్ బాబు అనే యువకులు వినాయక చవితి చందాలు దండి విగ్రహ ప్రతిష్ఠ చేసేవారట. ఈ సారి ఎందువల్లో షమీర్‌ను తమ బృందంలో చేర్చుకోక పోవడం, అతను వినోద్ కుమార్‌తో గొడవ పడడం, రౌడీ షీటర్ అయిన అతని చినాన్న రఫీ రంగప్రవేశంతో నడిబజార్లో పెద్ద రగడ కాబోతున్న తరుణంలో పోలీసుల రంగ ప్రవేశంతో సద్దుమణగడం జరిగింది. ఇంతలో బి.జె.పి. వారు వేలు పెట్టారు. ఆత్మకూరు బస్టాండ్ వద్ద రాస్తారోకో చేయను ప్రదర్శనగా తరలి వెళుతూ మార్గ మధ్యంలో గల మదీనా వాచ్ కంపెనీ పై రాళ్లు రువ్వారు. ఏ చిన్న పాటి సంఘటన జరిగినా ఎందువల్లో ఆ షాపునే తమ గురిగా ఎంచు కుంటున్నారు వీరు. మొత్తానికి ఎస్.పి. గారు డి.ఎస్.పి. సి.ఐ.లను అప్రమత్తులను చేసి వదంతుల మూలంగా మరెక్కడా గొడవలు జరుగ కుండా పోలీస్ పికెట్లు ఏర్పాటు చేశారు. మంగళ వారం తన ఆఫీసులో అన్ని పార్టీల వారితో శాంతి సంఘం సమావేశం కూడా జరిపి పరిస్థితిని అదుపులోకి తెచ్చారు.



పొగతోట సెంటర్‌లో వినాయకుడి పూజ చేస్తున్న కళ్యాణి ఫిలింస్ ప్రసన్న కుమార్ రెడ్డి, కెవిఆర్ ప్రభాకర్ రెడ్డి, విజయ కుమార్ రెడ్డి, కోనికా రమణయ్య; టౌన్‌లో కల్లా కళ్లు మిరుమిట్లు గొల్పే విద్యుత్ దీపాల వినాయకుడ్ని నెలకొల్పింది వీరే!

### దోపిడీ ముఠా అరెస్ట్

పట్టపగలు ఇళ్లలో దూరి ఒంటరిగా వున్న ఆడవాళ్లను కట్టి పడేసి దొరికిన వరకు దోచుకొని పోయే ఒక దొంగల ముఠాను క్రైం పోలీసులు పట్టేశారు. చిట్టగుంటకు చెందిన ఏ. మధుసూదన రావు, జి. దుర్గాప్రసాద్, టి. నాగేంద్ర రావు, కాశీ రమేష్ అనే నలుగురు యువకులు ఒక ముఠాగా ఏర్పడి నెల్లూరులోని బాలాజీ నగర్, పత్తేఖాన్ పేట, మూలపేటలలో

కొరకు 7 పేజీలో

## సణుగుడు

(4 పేజీ తరువాయి)

ఆయన చేసిన మొదటి పని తనకు అన్యాయంగా తిట్టిన కలెక్టర్ అభిప్రాయం పొందడం; గుడ్!

* * *

ఒకరు ఉత్తర ధృవం, ఇంకొకరు దక్షిణ ధృవం; రాజకీయ వైరులే కాదు - రాజకీయ సిద్ధాంతాలు ఉత్తర దక్షిణాలే; ఆయనా కొవ్వూరు మకాం, ఈయనా కొవూరు మకాం; ఒకరి సారా సెంటిమెంటు ప్రజెంట్ సిఎం చేతిలో వుంటే, ఇంకొకరి క్లోజ్ ఎక్స్ సిఎం చేతి మధ్య నాట్యమాడు తోంది. ఇద్దరికీ నేరుండి; ఇద్దరూ తమ తమ పదవులలో జరీయులే! ఈ రెండు శక్తుల మధ్య జిల్లా అధికారులు నలిగి పోతున్నారు; జరకతెరలో లోక వెళ్ళలేకపోతున్నారు; కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కష్టం. ఉత్తరాన వుంటే వారి దర్శనానికి వెళ్ళి దక్షిణాయనకు కినుక. ఇక్కడకొచ్చి అక్కడకు పోలేకుంటే ఆయన అలుక. ఒకే సమయంలో రెండు చోట్ల దర్శన మివ్వడానికి అధికారులేమైనా కృష్ణ పరమాత్ములా?

ఇద్దరు పెద్దలూ పెద్ద మనసు చేసుకొని, హైదరాబాదులో ముందుగానే మాట్లాడుకొని, ఏ ఒక్క రోజూ నెల్లూరులో ఇద్దరూ వుండే పరిస్థితి ఎదురు కాకుండా తమ పర్యటనలు రూపొందించు కుంటే అందరికీ హాయి. ఆలోచించండి!

* * *

ఈసారి మంత్రి వర్గ విస్తరణలో ఆశాభంగం పట్రా ప్రకాశ రావుదైతే, ఆరని తాపం సివి శేషారెడ్డి గారిది. చెప్పాల్సిన వారు ఒక్క మాట చెప్పి వుంటే తప్పేది లేదు కదా అన్నది ఆయన అలుక. ఏళ్ళ తరబడి వేరే ఆలోచన చేయక, ధీమా లేదురైనా మనసు కష్ట పెట్టుకోక, చెప్పులేకాక కాళ్లు అరిగేట్లు తిరిగి తిరిగి, సేవలు చేసినా ఏమి ఫలం అన్న నిర్వేదంలో పడి పోయినట్లున్నాడు సివి. కాంగ్రెస్ మళ్లీ అధికారంలోకి వచ్చే ఛాన్సు కనుచూపు మేరలో లేదు; ఆ పై ఎన్నికలకు ఎవరికి ఎవరు? ఇప్పుడు కాకుంటే ఇంకెప్పుడు వస్తుంది ఛాన్సు? కడపటి ఛాన్సు తప్పిందని ఆ మాత్రం కినుక చూపడం అర్థం చేసుకో దగినదే; సానుభూతి చూపదగిందే.

అలుక పాన్పు లెక్కితే విరహ తాపంలో పారిజాతాలు తెచ్చిచ్చే సత్యభామా ప్రియులు ఇప్పుడె వరున్నారు చెప్పండి? మనంతట మనమే సర్దుకోవాలి కాని!

## ప్రకటన

యిందు మూలముగా యావన్మందికి తెలియజేయుట మేమనగా-

నా క్లయింటు శ్రీ పేరకం వెంచు అంజనేయులు తన యావదాస్తులను గురించి 27.10.90 తేదిన తన తండ్రి గారైన శ్రీ పేరకం సోమయ్య, అన్‌కంటాక్సు ప్రాక్టీషనరు, నెల్లూరు వారి పేరిటికి వ్రాయించి యిచ్చిన రిజిష్టర్డు జనరల్ పవర్ ఆఫ్ అటర్నీ పత్రమును రద్దు పర్చుచూ సదరు ఏజంటు అయిన సోమయ్య గారికి యీ రోజు నా ద్వారా లాయరు నోటీసు యిప్పించి యున్నాడు గనుక యీ తేది మొదలు అనగా 23.9.93 తేది నుండి సదరు పవర్ ఆఫ్ అటర్నీ పత్రంను ఆధారం చేసుకొని మా క్లయింటుకు చెందిన ఆస్తులను గురించి సదరు పేరకం సోమయ్య గారు ఎవరి పేరటికి ఎలాంటి పత్రములు వ్రాసి యిచ్చినా అవి చెల్లవనియూ, అట్టి పత్రములు ఎవరైనా వ్రాయించుకొన్న యెడల వారికి ఎలాంటి హక్కులు సంక్రమించ వనియూ, నా క్లయింటు హక్కు ను భంగ పర్చ వనియూ తెలియజేయడమైనది.

23.9.93 తేది

యం.కె. శింగరాజు
అడ్వొకేటు, నెల్లూరు.

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ తరువాయి)

దోపిడీలు చేశారు. విచిత్రమే మిటంటే ఈ నలుగురూ విద్యావంతులు, దుర్గాప్రసాద్ అనే యువకుడు న్యాయవాది కూడా; అందరి తండ్రులూ రైల్వే ఉద్యోగులే. ఇంట్లో తల్లి దండ్రులిచ్చే డబ్బు చాలక, సినిమాలు చూసి ఆ పాత్రలో ఒకసారి వేసినారట.

యువతరం ఎట్లా వెర్రి తలలు వేస్తుందో చూడండి!

### లాయర్ల దీక్ష

గుంటూరులో హై కోర్టు బెంచ్ ఏర్పాటు కోరుతూ నెల్లూరు లాయర్లు తమ దీక్షలు కొనసాగిస్తూనే వున్నారు. 30 తేది వరకు కోర్టుల బహిష్కరణ ప్రకటించారు. ఒక్క కోర్టూ పని చేయడం లేదు.

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 (కొత్తవి) | 3,500/- |
| 9674 (కొత్తవి) | 3,800/- |
| ఐ.ఆర్. 20 | 3,000/- |
| ఐ.ఆర్. 64 | 2,700/- |

## జిల్లా వార్తలు

(5 పేజీ తరువాయి)

విష్ణు వర్ధన్ రెడ్డి, పేటలో సర్పంచ్ అశోక్ కుమార్ రెడ్డి పాల్గొని రాజకీయ వన్నె తెచ్చారు. పాత బస్టాండ్‌లో భారీ స్థాయి విగ్రహ ప్రతిష్టించిన తూర్పు వీధిలోని చిన్న విగ్రహం ఆకర్షణీయంగా వుండింది. సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా తూర్పు వీధిలో సినీ నటుడు పద్మనాభం హాస్యవల్లరి చేసి అనంతరం సన్మానం అందుకొన్నారు. ఎప్పుడూ భారీ స్థాయిలో విగ్రహ ప్రతిష్ట చేసే బజార్ సెంటర్ ఎందువల్లో ఈసారి బోసి పోయింది.

## పంచాంగము

27 తేది సోమవారము హస్తకార్తె ఆరంభం

30 తేది గురువారం గురుపూర్ణిమ

1 తేది శుక్రవారం మహాలయ పక్ష ప్రారంభం

### సెప్టెంబరు తిథులు

నిజ బాద్రపద శుద్ధ

| | | |
|---|---|---|
| తే 25 శని | దశమి | సా.గ. 4.45 వ |
| తే 26 ఆది | ఏకాదశి | సా.గ. 5.10 వ |
| తే 27 సోమ | ద్వాదశి | సా.గ. 6.00 వ |
| తే 28 మంగళ | త్రయోదశి | రా.గ.7.20 వ |
| తే 29 బుధ | చతుర్దశి | రా.గ.9.20 వ |
| తే 30 గురు | పూర్ణిమ | రా.గ. 11.06 వ |

అక్టోబరు తిథులు

| | | |
|---|---|---|
| తే 1 శుక్ర | పాడ్యమి | రా.గ. 1.15 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

## A4 (a) ప్రకటన

నెల్లూరు జిల్లా, ముత్తుకూరు మండలం, కృష్ణాపట్నం పాల్టు ఫ్యాక్టరీ ఇలాకా, పాల్టు లైసెన్సు నం. 10 / ఎక్స్‌టెన్షన్ I యొక్క ఏకైక లైసెన్సు దారుల్లై నటువంటి శ్రీమారుబోయిన గున్నారెడ్డి అను వారు 9.7.1993 తేదిన మరణించారు. వారి ఏకైక వారసురాలైన శ్రీమతి మారుబోయిన పోలమ్మ లైసెన్సు నెం. 10 / ఎక్స్ I ను తదానుగుణముగా మార్పు చేసి, తన పేర యిప్పించ వలసినదిగా కోరియున్నారు.

ఈ విషయమై ఎట్టి అభ్యంతరములు / ఆక్షేపణలు ఉన్నట్లయిన ఈ దిగువ సంతకము చేసిన అధికారికి వ్రాత మూలముగా ఈ ప్రకటన వెలువడిన 30 దినములలోగా తెలియ పర్చ వలెను. లేదేని, ఎవరికిని, ఎట్టి ఆక్షేపణలు లేవని భావింప బడి లైసెన్సు నెం. 10/ఎక్స్ I ను మార్పు చేసి శ్రీమతి మారుబోయిన పోలమ్మ పేర యివ్వబడును.

F No. 11/L/L/93, Dt: 21.9.93

యం.వి. సత్యనారాయణ
డిప్యూటీ సూపరింటెండెంట్
కృష్ణాపట్నం పాల్టు ఫ్యాక్టరీ

## ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియ చేయుట ఏమనగా

నా పెద్ద కుమారుడైన పేరకం వెంకట వెంచు అంజనేయులు (P.V.C. అంజనేయులు) ను, నేను నా స్వార్జితము ఖర్చు పెట్టి పెంచి, పెద్ద చేసి, విద్యాబుద్ధులు చెప్పించి, వివాహము కూడా చేసినాను. అతను గత రెండు మూడు సంవత్సరములుగా చెడు అలవాట్లకులోనై, చెప్పుడు మాటలు వినుటయే గాక, చెడ్డ సావాసములు, దురువ్యసనములకు లోనైనారు. నా పేర, నా భార్య పేర, నా కుమారుడైన పై పేరకం వెంకట వెంచు అంజనేయులు పేరున ఉన్న ఆస్తులన్నియు నా స్వార్జితములు, నా భార్య స్వార్జితమయి ఉన్నవి. వాటి పై నా పెద్ద కుమారునకు ఎటువంటి హక్కులు లేవు. అతను సదరు ఆస్తులను విక్రయించినను, అదు మానము పెట్టినను అన్యాక్రాంతములు చేసినను, చెల్లవు. నా పేర ఉన్న ఆస్తులు నా స్వార్జితములు పై నా కుమారుని పేర ఉన్న ఆస్తులు కూడా నా స్వార్జితములయి నామా అతని పేర ఉంచడము అయినది. కావున వాటి యందు కూడా అతనికి ఎలాంటి హక్కులు లేవు. అతను చేసిన లేక, చేయబోవు అప్పులు, చర్యలు నన్ను నా భార్యను మా ఆస్తులను బద్ధకించవు. వాటికి మేము బాధ్యులము కాము. కావున ఈ విషయములు జాగ్రత్త చేయడమైనది.

పేరకం సోమయ్య
21/93 A, Balaji Nagar, NELLORE



ములుమూడి
సులోచనమ్మ
జననం: 21.10 1935
మరణం: 14.9.1993

## శ్రద్ధాంజలి

అకస్మికముగా మా నుండి మృత్యువు కబళించి మమతాను రాగాలతో బ్రతికే మనల్నిచూసి విధి నిర్దాక్షిణ్యంగా నీ నుండి దూరం చేసినా నీ రూపం, నీ చిరునవ్వు, నీ మాటలు మా హృదయాలలో ఎల్లవేళలా నిలిచే ఉంటాయి. నీవు లేని లోటు తీర్చలేనిది. నీవు లేవన్న కఠోర నిజం మా గుండెల్ని పిండి చేస్తున్నది.

ఇట్లు శోక తప్త హృదయాలతో

ములుమూడి సూర్యప్రకాశరావు (భర్త)
ములుమూడి విజయకుమార్ (కుమారుడు)
మరియు కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు

26.9.93 తేదిన వైకుంఠ సమారాధన

## గూడూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. 18 / 93

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా,
పొదలకూరు -వాది

Vs

1. కొత్తపల్లి నరసింహాచారి S/o. పెంచలాచారి
2. కొండా సుబ్బారెడ్డి, S/o. పెంచల రెడ్డి, నెర్నూరు గ్రామం, కలువాయి (మం.) -ప్రతివాదులు

### నోటీసు

వారి పై నంబరు దావా బాకీ రాబట్టు నిమిత్తం మీ మీద దాఖలు చేసి యున్నందున మీరు 26.10.93 తేదీన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించ బడును.

వాయిదా: 26.10.93

సి.పరాంకుశ రావు
వాది యొక్క న్యాయవాది

## గూడూరు డి.ము. కోర్టులో

E.P. 25/88 : O.S. 307/77

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా,
గూడూరు డిక్రీహోల్డరు (DHr)

Vs

వంజివాక సుబ్బయ్య
జడ్జిమెంటు డెటారు(J.Dr)

### వేలము ప్రకటన

పై నంబరులో డిక్రీ హోల్డరు తనకు రావలసిన బాకీని రాబట్టు కొనుటకు ఈ క్రింద కనబరచిన జడ్జిమెంటు డెటారు తాలుకు క్రింద కనబరచిన షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని 7-10-93వ తారీఖున ఉదయం 10 గంటల నుండి 5గంటల లోపల బహిరంగముగా వేలము జరుపబడును.

### షెడ్యూలు

నెల్లూరు జిల్లా సైదాపురం మండలం సైదాపురం గ్రామములో యింటి నివేశ స్థలము 93 1/2అంకణములు, (625చదరపు మీటర్లు)లలో పూరి యిల్లు పాత యింటి నెంబరు 8/13 పాత అసెస్‌మెంటు నెంబరు 13 కొత్త అసెస్‌మెంటు నెంబరు 754తో సహా.

హద్దులు: తూర్పు:గమండ్ల పాళెం వీధి; దక్షిణం:బలిజపాళెం వీధి; పడమట కాలువ;ఉత్తరం:వంజివాడి సిద్దమ్మ యింటి స్థలము.

డిక్రీహోల్డరు విలువ:రూ 12,000/-
అమినా విలువ:రూ13,000/-

పి.యస్.మదన్‌మోహన్
డిక్రీహోల్డరు అడ్వకేటు.

# శివారెడ్డి పద్యాలు

### ముఖ్యమంత్రి

మళ్లీ తిరిగి ముఖ్యమంత్రి నెదురుమల్లి
మాటా రేపా కవిని మాట జెపితె
తిరుగులేదుబ్రహ్మతీర్పు. యీ కాలంలో
నిజము జెపితె నింద నెత్తికొస్తది!

### పుణ్యమేదో జేసి

పుణ్యమేదో జేసి పుట్టాలి లేకున్న
లాకియరవుగావు. లభ్యపడదు
చదువుసాము రాదు సోషల్యవతినీకు
భార్యగాదు నీవు బాగుపడవు

### ఎక్కడుందో స్వర్గం

ఎక్కడుందో స్వర్గమెదుందో నరకమ్ము
అసలు దేవుడెవడు అయ్యవూరు
పేరు యిండియాలో పూరూర దేవుళ్లు
గుళ్లు గోపురాలు గోల రచ్చ

### ఆడబిడ్డ

ఆడబిడ్డ ఫస్టు అది నేను కాదన్ను
అన్నిటిల్లో గాదు కొన్నిటిల్లో
కన్నుబున్నురడ్డి, కొగిరిస్తె పొర్ధి
అదొక పెద్ద ప్రాబ్లమేమి గాదు!

### ఎక్సు ముఖ్యమంత్రి

ఎక్సు ముఖ్యమంత్రి ఎన్టిరామారావు
మళ్లీ నిన్న మొన్న పెళ్లికొడుకు
యేజీ సెవంటీయు ఎంతైన పరవాల
ముద్దులొలుకు జంట యిద్దరొకటె

### చదువు వెలుగు

నీకు ఎంత గానొ బాకి నెల్లూరు జిల్ల
పొదిపోసి నావు చదువు సాము
బాలబాలికలకు భళాభళిని సేవ
చదువు వెలుగు వ్రాశసంగ్రహంగ

### షేకు మస్తాను

ఎల్లరెరిగి నోడు యీ షేకు మస్తాను
మచ్చుతునక స్కూలు మాష్టారులకు
నిన్నమొన్న రిటైరన్నారు విశ్రాంతి
అవసరమ్ము రెస్టు అతి జరూరు!

## మునిసిపాలిటి

(2 పేజీ తరువాయి)

| | | | |
|---|---|---|---|
| గోదాన్లు | 7.24 | 14.21 | 96 |
| పరిశ్రమలు | 3.64 | 7.28 | 100 |
| సినిమా హాళ్లు | 1.49 | 3.38 | 126 |
| కళ్యాణ మండపం / కాంప్లెక్స్ | 0.24 | 0.45 | 82 |
| నాన్ రెసిడెంట్స్ | 53.21 | 105.0 | 98.7 |

ఈ పన్నులు ఐదు సంవత్సరాల పాటు అమలులో వుంటాయి. ఐదేళ్ల కొకసారి 5 శాతం చొప్పున పన్ను పెంచుతారు. అందువల్ల తామెంత పన్ను కట్ట వలసింది ఇళ్ల యజమానులకు ఎప్పుడూ తెలుస్తూం టుంది. ఉన్నట్లుండి పెరిగి పోతాయన్న భయం వుండదు.

రేట్ పేయర్స్ అసోసియేషన్ ఈ పెంపకం పట్ల అసంతృప్తి వ్యక్తం చేస్తున్నది. పెంపు పట్ల నిరసనగా ఒక అఖిల పక్ష కమిటీ సైతం ఏర్పడింది. ఇళ్ల పైన 25 శాతం, ఇతరాల పైన 50 శాతం మించి పన్ను పెంచ రాదన్నది అఖిల పక్ష కమిటీ సూచన. అయితే మునిసిపాలిటీ దీనికి అంగీకరించడం లేదు. ఎట్లా అంగీకరిస్తుంది? జీతాలిచ్చి ఉద్యోగులను మేపడం తప్ప, ఇంకే పని చేయడానికి వారి దగ్గర చిల్లి గవ్వ లేదు. కనీసం కాలిపోయిన బల్బు మార్చే దిక్కు కూడా లేదు. రోడ్లు, మంచి నీళ్లు, మురుగు కాలువలు,డ్రైనేజీ, పారిశుద్ధ్యం వంటి పనులు ఎక్కడి వక్కడ మూల పడి పోయాయి.

రమేష్ రెడ్డి ఛైర్మన్‌గా మునిసిపల్ కౌన్సిల్ ఎన్నికైన నాటికి ఖజానాలో కోటి 76 లక్షల మిగులు వుండేది. ఆయన దిగిపోయేటప్పటికి 40 లక్షల అప్పు మిగిలింది. ఇక అధికారులు చేయ గల్గింది ఏముంది? జీతాలివ్వడం తప్ప ఇంకేమీ చేయడం లేదు వారు. ఒక్కొక్క నెల వాటికీ కష్టంగానే వుంటున్నది.

ఈ పరిస్థితులలో పన్నుల తగ్గింపుకు సమ్మతించడం ఎట్లా సాధ్యమంటున్నారు కమీషనర్ కెప్టెన్ కెవి రెడ్డి. కొత్త విధానంలో పన్నులు వసూలు చేస్తే జీతాలు, ఇతర ఖర్చులు పోను కోటి రూపాయల వరకు మిగుల్తుందని, దానితో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టే వీలుంటుందని ఆయన భావిస్తున్నారు.

అధికార్లు చెప్పేది వాస్తవం గానే కన్పిస్తుంది. కాని అభివృద్ధి పనులు అమలు జరగక పోవడానికి కేవలం పన్నుల వసూలు తగ్గడమే కారణమా? కానే కాదు. అసలు కారణం - అవినీతి. ప్రభుత్వ నిధులతో గత పదేళ్ల ఇవతల చేపట్టిన వివిధ పనుల్లో కనీసం 50 శాతం సక్రమంగా అమలు జరిగి వుండినా టౌన్ ఈ పరిస్థితిలో, ఈ దుస్థితిలో వుండేది కాదు. కౌన్సిల్ వున్నంత కాలం కౌన్సిలర్లు, మునిసిపల్ నిధులను దొంగలు పూళ్లు పంచుకున్నట్లు పంచుకొని తిన్నారు. కాంట్రాక్టర్ల నుంచి నేరుగా పర్సంటేజీలు తీసుకొని, అధికార్లకు అలుసై పోయి, ఏ పనిలోనూ నాణ్యత లేకుండా చేసి భ్రష్టు పట్టించారు. మట్టి దొంకల వలె వుండే విస్తరణ ప్రాంతం రోడ్లు వదలి పెట్టి, పలుకుబడి కల్గిన కౌన్సిలర్ల మెహర్బానీ కోసం సందుల్లో గొందుల్లో సిమెంట్ రోడ్లు వేసి లక్షలకు లక్షలు దుబారా చేశారు. ఆ సిమెంట్ రోడ్లు ఏవీ కనీసం రెండేళ్లు కూడా నిలువ లేదు.

కమీషనర్ గారి రాజ్యం వచ్చిన తర్వాత పెనం మీద నుంచి పొయ్యిలో పడినట్లు యింది నెల్లూరు ప్రజల పరిస్థితి! పాత కమీషనరు శ్రీ రామనారాయణ రెడ్డి కమ్మగా మాటలు చెప్పడం తప్ప చేసిన పని పూజ్యం. పైగా కౌన్సిల్ హయాంలో కంటే పర్సంటేజీలు పెరిగి పోయాయి. ఎట్లయుతేనేమి - దాదాపు పదేళ్ల పాటు నెల్లూరు మునిసిపాలిటీని ఎవరికి దొరికినంత వారు పిండుకొని, వట్టి పోయిన గొడ్డు మాదిరి తయారు చేశారు. దాని ఫలితమే నేటి దుస్థితి!

కొత్త కమీషనర్ గారు సైన్యం నుంచి వచ్చిన వ్యక్తి. కరకుగా వుండాలి; మాట తీరు చూస్తే అట్లనే కన్పడుతూంది. ఆయన పుణ్యానైనా - పన్నులు దండితే దండారు - టౌన్‌లో కనీస సౌకర్యాలకు కొరత లేకుండా చేయగల్గితే పన్ను బాధను మర్చి పోతారు పౌరులు.

## విస్తరణ

( మొదటి పేజీ తరువాయి)

అధ్యక్ష పీఠం నుండి మజీని తొలగించే విషయం ప్రధానితో చర్చించారని తెలుస్తోంది. అయితే మజీకి ఏదో ఒక పదవి ఇవ్వకుండా పిసిసి పీఠం నుంచి తొలగించడం సబబుగా వుండదని ప్రధాని భావిస్తున్నారు. మజీకి ఇవ్వదగ్గ పదవి ప్రస్తుతానికి ఏదీ లేదు కాబట్టి మజీ ఉద్వాసనకు మరి కొంత సమయం పట్టవచ్చు. మజీ నుంచి ఎదురవుతున్న తలనొప్పిని ఎలా తట్టుకోవాలో ముఖ్యమంత్రికి అంతు బట్టడం లేదు. మజీ బహిరంగంగా పత్రికల కెక్కకుండా అయినా చూడాల్సిందిగా ప్రధాన మంత్రిని ముఖ్యమంత్రి కోరారట. అయితే ప్రధాని మాత్రం ముఖ్యమంత్రి చేస్తున్న ఫిర్యాదులు వింటూనే "అంటీ అంటనట్లు" గా వ్యవహరిస్తున్నారు.

## చిరంజీవి

( మొదటి పేజీ తరువాయి)

స్థాపన కవసరమైన ప్రాథమిక వాతావరణం సృష్టించడం, వివిధ వర్గాల నాయకులను సమైక్య పరచడం వంటి బాధ్యతలు మాజీ కేంద్ర మంత్రి శివశంకర్‌కు అప్పజెప్పారట. శివశంకర్ చేతికి కళ్లెం దొరికితే తమకు చిప్పే గతి అని కాపు నాయకులు వాపోతున్నారు.

## బాలాయపల్లి

5 పేజీ తరువాయి

డేగా నారసింహా రెడ్డి ఆగి, గ్రామస్తులకు నచ్చ జెప్పి పంపేశారు.

ప్రక్కరోజు ఉదయం ఎస్‌పి వంటి ఉన్నతాధికార్లు, ఎస్‌సి, సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి వంటి తెలుగు నాయకులు, దళిత సంఘాల పెద్దలు బాలాయపల్లిలో వాలిపోయారు. ఎస్‌బి డిటిఐ కుమారీను సస్పెండ్ చేయాలన్నది గ్రామస్తుల కోరిక; ఎస్‌బిని కులం పేరుతో తిట్టినందుకు చట్ట ప్రకారం చర్య తీసుకోవాలని ఎసిపి పట్టుదల. మధ్యలో సబ్‌కలెక్టర్ ఇరు వర్గాలను సర్దబెడుతున్నారు. ఎస్‌బిని, తిట్టి, స్టేషన్ పైకి దాడికి వచ్చిన వారినందరినీ అరెస్టు చేయాలని పోలీసు రంగం సిద్ధం చేసి వుంది. గ్రామస్తులూ అందుకు రెడీ అంటున్నారు. అరెస్టు లంటూ జరిగితే ఆడ, మగా అందరూ కలిసి స్టేషన్‌లోనే కూర్చోవాలని వారి సంకల్పం. సబ్ కలెక్టర్ మొత్తం సంఘటనల పై దర్యాప్తు జరిపి, కలెక్టరుకు నివేదిక సమర్పించారు. ప్రస్తుతం గ్రామంలో ఉద్రిక్తత నెలకొని వుంది.

ఇప్పటి వరకు అందుతున్న సమాచారాన్ని బట్టి, ఈ సంఘటనలో ఇరు వర్గాలదీ తప్పే. తమ్మను తిట్టారని ఫిర్యాదు చేసినంత మాత్రాన్నే కనీస విచారణ కూడా జరప కుండా అరెస్టు చేయడం, ఫిర్యాదీల ఎదుట గుడ్డలిప్పించి, దిసమొలతో నిలబెట్టి అవమానించడం పోలీసుల తప్పు. దీనికి హింసాత్మకంగా ప్రతిస్పందించి స్టేషన్ పై దాడి చేసి, పోలీసు సమక్షంలోనే ఫిర్యాదీలను కొట్టబోవడం, దురుసుగా ప్రవర్తించడం వెంకటయ్య చౌదరి కుమారుల తప్పు. ఇరువర్గాలలో ఎవరు సంయమనంతో వ్యవహరించి వుండినా, సర్దుబాటు అయిపోయి వుండ వలసిన ఈ సంఘటన ఇప్పుడు చిలికి చిలికి గాలి వానగా మారింది. కుల ఘర్షణగా రూపాంతరం చెందింది. అధికారులూ, నాయకులూ పట్టుదలకు పంతాలకు పోకుండా ఇప్పటికైనా సామరస్య పరిష్కారానికి ప్రయత్నించాలి. లేకుంటే ఆ తర్వాత అందరూ బాధ పడ వలసి వస్తుంది.


### జమీన్‌రైతు

సంవత్సర చందా రు 100/-
6 నెలలకు- రు.50/-




## స్మృత్యంజలి



మా అబ్బాయి

### గోసు వెంకట సుబ్బారెడ్డి

పందొమ్మిదవ వర్ధంతి : 25.9.93

నీ జ్ఞాపకాలను తలచుకొని నీవు లేని ఈ లోకాన్నుండి నీ ఆత్మశాంతికై చిరకాల జన్మ రాహిత్యముగా నీవు శైవ సన్నిధిన చిరశాంతితో వుండవలెనని అను క్షణము ప్రార్థిస్తూ

జి. రమణారెడ్డి, సుమిత్రమ్మ - తల్లిదండ్రులు

మరియు కుటుంబ సభ్యులు, ఫత్తేఖాన్ పేట, నెల్లూరు

# సాయిబాబా పై రెండు సినిమాలు

నెల్లూరేయుడు సాయి ప్రకాశ్ ప్రధాన పాత్ర నిర్వహిస్తూ దర్శకత్వం వహించిన "భగవాన్ శ్రీ సాయిబాబా" అన్నుడ చిత్రానికి పుట్టపర్తి శ్రీ సత్యసాయిబాబా కథ నమగార్చారు. ఇదిప్పుడు తెలుగులో డబ్ చేయబడుతోంది. ఇందులో సాయి ప్రకాశ్(రెడ్డి)తో పాటు శశికుమార్, సుధారాణి, చందు, అలా, శ్రీనాథ్, బైజగరిక్, శ్రీనివాస మూర్తి, వజ్రముని, చంద్రికా, రమేష్ భట్, గీతా, శ్రీలలిత, పాల్గొన్నారు. సంగీతం : హంసలేఖ; ఉపేంద్ర కుమార్; ఛాయా:జానీలాల్.

కె. వాసు దర్శకత్వంలో హైదరాబాదుకు చెందిన ఓ పారిశ్రామిక వేత్త నిర్మించే " శ్రీసాయిబాబా మహాత్మ్యం " చిత్రానికి ప్రస్తుతం జరుగుతోంది.

ఇదే చిత్రం కొంతకాలం క్రితం విజయచందర్ హీరోగా తయారైన విషయం ప్రేక్షకులకు విదితమే.

### విజయావారి చిత్రం

"బృందావనం" అనంతరం ఇప్పుడు "భైరవ ద్వీపం" జానపద చిత్రాన్ని భారీ ఎత్తున సర్వజనాకర్షణీయంగా నిర్మిస్తున్న పై సంస్థ త్వరలో హాస్య చిత్రానికి చక్కని నిర్వచనమిచ్చే ఒక విశిష్టమైన ఇతివృత్తాన్ని ఎన్నిక చేసిందట. ఈ చిత్రంలో వరకట్నం మీద చిన్న చురక కూడా ఉంటుంది. ఆదిలో "పెళ్ళి చేసి చూడు, మిస్సమ్మ, గుండమ్మ కథ", వంటి వినోదాత్మక చిత్రాలు నిర్మించిన విషయం ప్రేక్షకులకు మరుపురాదు.

# సి
# ని
# మా

# మనసుకు నచ్చక మళ్ళీ షూటింగ్

సహజకవి మల్లెమాల సుందర రామిరెడ్డి గారి, ఆయన ఏకైక పుత్రుడు ఎం. శ్యాంప్రసాద్ రెడ్డి గారి పర్ఫెక్షన్ కోసం తపించే ప్రొడ్యూసర్లు. లోగడ చాలా భాగం పూర్తయిన 'అమ్మోరు' చిత్రం ఆశించినంత తృప్తి కల్గించక పోయేసరికి, ఆ రీళ్లను కండెమ్ చేసి, కోడి రామకృష్ణ దర్శకత్వంలో పూర్తిగా రీ షూట్ చేయ నారంభించారు. మరొకరైతే, ఈ అధిక వ్యయప్రయాస లెందుకులే – అని ఉపేక్షించే వారు. "హైదరాబాదులో, గోదావరి నదీ ప్రాంతంలో, రామచంద్రా పురం వద్ద షూటింగ్ జరుపుతున్నాం" అన్నారు శ్యామ్‌ప్రసాద్ రెడ్డి. ఈయన నిర్మాతగా ఎం.ఎస్. రెడ్డి సమర్పించే ఎం.ఎస్ ఆర్ట్ మూవీస్ "అమ్మోరు" చిత్రంలో సురేష్, సౌందర్య, రామిరెడ్డి, బాబూ మోహన్, చిదంబరం, రవీంద్ర రెడ్డి, శ్రుతి, జయ, అమ్మోరుగా రమ్యకృష్ణ నటిస్తున్నారు. మాటలు: సత్యానంద్, పాటలు: మల్లెమాల, రసరాజు, సంగీతం: చక్రవర్తి.

### "కళాసాగర్" ఛైర్మన్‌గా ఎం.ఎస్. రెడ్డి తిరిగి ఎన్నిక

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సమితి 'కళాసాగర్' 9వ సర్వసభ్య సమావేశం ఇటీవల జరిగినప్పుడు ఛైర్మన్‌గా సహజకవి, చిత్ర నిర్మాత మల్లెమాల సుందర రామిరెడ్డి, అధ్యక్షుడుగా మధుర గాయకుడు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, తిరిగి ఎన్నికయ్యారు.

# దాసరి ఇంటి చుట్టూ

దాసరి చక్కని వక్త, రాజకీయ దురంధరుడు. కొందరు కాపు నాడు నాయకులు, మంత్రి పదవులు లభించని అసమ్మతి వర్గానికి చెందిన కొందరు నాటి మంత్రులు రాష్ట్రంలో తృతీయశక్తిగా కాంగ్రెస్(ఐ) - తెలుగుదేశం పార్టీలకు ప్రత్యామ్నాయంగా ఒక ప్రాంతీయ పార్టీని ప్రారంభించాలని దాసరి పై ఒత్తిడి తెస్తున్నారు. కాంగ్రెస్ (ఐ) తో వ్యతిరేక వాతావరణం, ఎన్‌టిఆర్ పునర్వివాహం వల్ల దేశం పార్టీలో అంతర్గత విభేదాలు డిసెంబర్ ప్రాంతంలో మధ్యంతర ఎన్నికలకు దారి తీస్తాయని కొందరి నమ్మిక. దాసరి విజృంభించడానికి ఇంత కన్నా చక్కని అదను మరేముంటుంది? కాని, ఆయన ఎంతటి లౌక్యుడు అంటే – తన నిర్ణయాన్ని వెంటనే చెప్పడు. తన చుట్టూ రాజకీయ ప్రముఖులు చెంగలిస్తూ చేసుకుంటాడు. వాళ్లు కొత్త పార్టీ పెట్టమని ఒత్తిడి చేస్తున్నట్లు విపరీతంగా ప్రచారం చేయిస్తాడు. [illegible]

# నాయకుల ప్రదక్షిణ

[illegible] రంగంలోకి దూకుతారు. పదవీ వ్యామోహం ఎవరి కుండదు?

### రాజకీయాల నుంచి నటనకు 'నో'

తమిళనాడు మాజీ స్పీకర్ పాండ్యన్ అడ్వకేటు. పరమ ఎం.జి.ఆర్.భక్తుడు. చక్కని వక్త. ఎం.జి.ఆర్ గతించాక ఈయన ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. పార్టీ నుంచి వైదొలగి, మళ్ళీ ఇటీవలే అందులో చేరాడు. ఈ మధ్యనే ఆయన గృహానికి "పోలీస్ లాకప్" చిత్రాన్ని నిర్మిస్తున్న ఎం.యస్.రాజుతో అతని మిత్రుడు, సహజ కవి మల్లెమాల సుందరరామి రెడ్డి పుత్రుడు నిర్మాత ఎం.శ్యామసుందర రెడ్డి వెళ్ళారట. "కోడి రామకృష్ణ దర్శకత్వంలో తయారవుతున్న మా చిత్రంలో ఓ కీలకమైన పాత్రను మీరు ధరిస్తే బాగుంటుందను కొంటాను. పోస్టర్లలో, వీడియోలో మీరు ఆవేశంగా పిడికిలి బిగించి ఉండే తీరు మమ్మల్నెంతో ఆకరించింది. ఆ రాజకీయ వేత్త పాత్రకు మీరు కరెక్టుగా సరిపోతారు. హైదరాబాదులో నెల రోజుల షూటింగ్ ఉంటుంది," అన్నారట.

ఈ విషయం పాండ్యన్ పాత్రికేయులకు చెప్తూ, "నాకు నవ్వాలో ఏడవాలో తోచలేదు. మా గురువు ఎం.జి.ఆర్ గారు సినిమా రంగం నుంచి రాజకీయ రంగంలోకి వచ్చారు. రెండు రంగాలలోనూ ఆయన

(రవ 11 వ పేజీలో)

మధుమతి చిత్రంలో మధుమతి, ప్రసన్న

# రేవతి నచ్చిన తారలు

రేవతి చక్కని నటి. ఆమె మనసులోని అభిప్రాయాలను ఏ మాత్రం సంకోచం లేకుండా బయట పెట్టేస్తుంది. ఇటీవల తోటి తారల ప్రసక్తి వచ్చినప్పుడు నటనలో లక్ష్మి, రాధిక, అందచందాలలో శోభన, భానుప్రియ నాకెంతో నచ్చిన నటీమణులు. ఏదో షూటింగ్ స్పాట్లో కలిసాం. [illegible] షూటింగ్ ముగించుకొని వెళ్ళిపోరాం [illegible] ఈ తోటి తారలు దర్శకుడు అనించే ఎఫెక్ట్ వచ్చే వరకు శ్రమిస్తారు. అందుకే వీళ్లంటే నాకెంతో ఇష్టం. నేను కూడా వీరి అడుగుజాడల్లోనే నటిస్తుంటాను అంది.

### "మగరాయుడు"

పై టైటిల్‌ను బట్టి వెరైటీ పేరున మన దర్శక నిర్మాతలు [illegible] తాపత్రయ మేమిటో తెలుస్తుంది. ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వం నెరపే పై చిత్రంలో విజయశాంతి నాయిక. గట్టిగా ఒక పేరు మోసిన [illegible] నటిస్తారట.

దర్శకుడి మసాలా టపాసులు తుస్సుమన్నాయి

# రౌడీ అన్నయ్య

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

ఘట్టమనేని శివరామ కృష్ణయ్య పేరు ప్రఖ్యాతులున్న ఒక పబ్లిక్ ప్రాసిక్యూటర్ (కృష్ణ) ఆయన మారువేషంలో ట్రాక్టర్ డ్రైవరుగా ఒక పల్లెటూరు చేరుకుంటాడు. అక్కడ జ్యోతి (రంభ) అనే అమ్మాయి పరిచయ మవుతుంది.

శివరామకృష్ణ ట్రాక్టర్ డ్రైవరుగా ఆ వూరు వచ్చేందుకు కారణముంది. ఆ వూళ్లో దుష్టుడుగా చలామణి అవుతున్న రంగారావు (కాస్ట్యూమ్స్ కృష్ణ) తాను చేసిన [illegible] తన బంధువైన ధర్మారావు (వాలస్య) మీదకు బనాయిస్తాడు. ధర్మారావు మంచికి మారు పేరు. ఘటికుడైన శివరామకృష్ణ కోర్టులో కేసు వాదించి ధర్మారావును హంతకుడుగా నిరూపిస్తాడు. ధర్మారావుకు శిక్ష పడుతుంది. అవమానం భరించలేక ధర్మారావు ఆత్మ హత్య చేసుకొని తాను నిర్దోషినని నిరూపించు [illegible]. ధర్మారావు నిరపరాధి [illegible] హంతకుడు రంగారావు అందుకు ప్రత్యక్ష సాక్ష్యులు గుళ్లో పూజారి, వూళ్లో పోస్టు మాస్టర్ అని తెలియజేస్తూ శివరామ కృష్ణయ్యకు ఒక వుత్తరం వస్తుంది. అసలు హంతకుణ్ణి స్వయంగా పట్టుకునేందుకు, తన వల్ల నష్టపోయిన ధర్మారావు కుటుంబాన్ని ఆదుకునేందుకు శివ రామకృష్ణయ్య, ట్రాక్టర్ డ్రైవరు వేషంలో ఆ వూళ్లోకి ప్రవేశిస్తాడు. ధర్మారావు తల్లి (నిర్మలమ్మ), భార్య (అన్నపూర్ణ) ల వద్ద చేరి వారికి ఆత్మీయుడుగా వ్యవహరిస్తాడు. అన్ని విషయాల్లో వారికి సహాయంగా వుంటాడు.

రంగారావు, శివరామకృష్ణయ్య [illegible] పని కట్టాడు. ధర్మారావు కుటుంబం శివరామకృష్ణయ్య మీద తిరగ బడేటట్లు వాతావరణం [illegible] రంగారావు. అతని ఎత్తుల [illegible] శివరామకృష్ణయ్య రంగారావు రంగు బైట పెట్టాడు. అసలు హంతకుడు రంగారావేనని రుజావు చేస్తాడు. ఈ కథ సత్యమూర్తి వ్రాశాడు. మాటలు, స్క్రీన్ ప్లే కూడా ఆయనే వ్రాశారు. ఆయన చేతి మీదిగా నడిచిన ఈ మూడు అంశాలు చిత్రాన్ని చాలా పేలవంచేశాయి. పేరు మోసిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ అసలు హంతకుడి వివరాలు, గట్టి సాక్ష్యాధారాలు జాబు ద్వారా లభ్యమైనప్పుడు. మరలా కేసును తిరగదోడి, కోర్టు ద్వారా అసలు హంతకుణ్ణి నిర్ధారణ జరిపి వుండ వలసింది. కాని ఆ పబ్లిక్ ప్రాసిక్యూటర్ ట్రాక్టర్ డ్రైవరు వేషంలో హంతకుణ్ణి పట్టుకునే శ్రమకు దిగటం అసాధారణంగా వుంది.

రంగారావు తాను చేసిన హత్యను మంచి వాడు, తన బంధువు అయిన ధర్మారావు మీద మోపేందుకు బలమైన కారణం కనిపించదు. అలాగే రంగారావు తన చెల్లెల్ని చంపి పాతి పెట్టటం అర్థం లేని విషయం.

ఈ చౌకబారు కథకు దర్శకుడు తమ్మారెడ్డి భరద్వాజ కొన్ని

(రవ 11 వ పేజీలో)

## తుఫాన్

(4 పేజీ తరువు)

దూరదర్శన్‌లలో పలుమార్లు ప్రసారమైంది. తెలుగు నాటక రంగంలో సంచలనాన్ని సృష్టించిన నాటకమిది. లెక్కలేనన్ని మార్లు ప్రదర్శన భాగ్యం పొందింది. ఈ నాటకానికి రాఘవ రెడ్డి పాత్ర ప్రాణప్రదమైంది. నెల్లూరు మండల తెనుగు స్వరూప స్వభావాలను అచ్చుపోసినట్లు ఈ నాటకంలో కుమ్మరించారు. నాటకంలో అంకవిభజన మాని రంగ విభజన చేశారు. కన్యాశుల్కంలోని గిరీశం పాత్ర వలె ఇందలి రెడ్డి పాత్ర సజీవత్వాన్ని పుణికి పుచ్చుకొంది. ఇది ఏకాంకిక నాటకం. విజయంగా చలన చిత్ర రూపాన్ని పొందాల్సిన నాటకమిది. సాహిత్య మర్మజ్ఞులెందరో ఈ తుఫానులో మునిగి తేలారు. ఈ నాటకంలోని సంభాషణలు, సన్నివేశాలు ప్రేక్షకుల్ని తన్మయుల చేస్తాయి. ఈ నాటకం చదవడానికి ఎంత సమయం పడుతుందో ప్రదర్శించడానికీ అంతే సమయం పడుతుంది. ఈ నాటకంలో ఓ సన్నివేశం — రసవత్తరంగా విస్తరించడం జరిగింది. రాఘవ రెడ్డి మద్రాసుకు కోర్టు పని మీద రావడం, అక్కడ ఆయన వకీలు కుప్పుస్వామి రెడ్డి తన కుమార్తెను రెడ్డి గారి కుమారుడు గోపాలయ్య కిచ్చి వివాహం చేయ నిశ్చయించడానికి రావడం, ఇంతలో గోపాలయ్య తానొక అమ్మాయిని బెంగుళూరులో ప్రేమించానని చెప్పడం, దానికి రెడ్డి ఆవేశంతో తుఫాన్ వీచడం, ఇంతలో ఆ అమ్మాయి కుప్పుస్వామి కుమార్తెయని తెలిసి, పట్టలేని ఆనందంతో ఉండడం కథాసారం. నాటకంలో నెల్లూరు మాండలికాలను ఇంతగా పుణికి పుచ్చుకొని ప్రయోగించడం చెప్పుకో దగ్గ విషయం. ఒకప్పుడు నెల్లూరు మాండలికాల అస్తిత్వానికి బాటలు వేసిన వారు జమీన్‌రైతు వ్యవస్థాపకులు శ్రీ రామానాయుడు గారు; వారి తరువాత వారి వలె ఒంట బట్టించు కొన్న వారు రామకృష్ణయ్య గారు కనబడుతారు. నెల్లూరు పల్లెటూరి రెడ్ల వ్యావహారిక భాష తీరు తెన్నులు చక్కగా తీర్చిదిద్దారు. ఎక్కిందాక, ఏందబ్బయ్యా, ముంచెనకలు, మంచి సెబ్బరా ఈ పదాలు నెల్లూరు మాండలిక ప్రయోగాలకు సజీవ సాక్ష్యాలు. నెల్లూరి రెడ్ల ఆచార వ్యవహారాలు, వాక్సమత్కృతి తుఫాన్ రెడ్డిలో మూర్తీభవింప జేశారు. రాఘవరెడ్డి నాటకంలో ఎంత హాస్యం చూపారో అలుసుతనం లేక అంతే హుందాను కూడా పోషించారు.

ఇక వీరి విముక్తి నాటకం హరిజనోద్ధరణ రూపంగా అవతరించింది. మహాత్మా గాంధీ రూపొందించిన నిర్మాణాత్మక కార్యక్రమం ద్వారా హరిజనులు ఎలా ప్రగతి సాధించారో పంచవర్ష ప్రణాళికలు హరిజనోద్ధరణకు ఎలా తోడ్పడ గలవో వివరిస్తూ వ్రాసిన నాటకమిది. ఈ నాటకాన్ని హరిజన హాస్టలు విద్యార్థులు ప్రదర్శించారు. ఈ నాటకంలో నెల్లూరు గ్రామీణ పదజాలాలు పుణికి పుచ్చుకొన్నాయి. ఈ నాటకం అస్పృశ్యతను, బడుగు వర్గపు వారి దారిద్ర్యాన్ని నిర్మూలించే దృక్పథంలో వ్రాసిన నాటకం. నాటకం హరిజన దినోత్సవంతో ప్రారంభమౌతుంది. హరిజన పేరయ్య కుటుంబ గాథతో ఇది ప్రారంభ మవుతుంది. ఇది 5 రంగాలుగా విభాగం చేయబడింది.

ఆంగ్లంలో వ్రాయబడిన Refund (రిఫండ్) అనే నాటకము ననుసరించి వ్రాయబడిన ఏకాంకిక నాటిక 'వాపస్' అనేది. ఇందు రచయిత భారతీయ వాతావరణాన్ని సృష్టించి వ్రాశారు.

ఇక శాకుంతల నాటకం కాళిదాస శాకుంతలానికి అనుకరణయే గాని అనువాదం కాదు. నాటకేషు శకుంతలా అన్నారు గనుక శాకుంతలం నాటక సాహిత్యానికే తలమానికం. ఇది 1967 లో ప్రకటించారు. ప్రధాన కథా సూత్రానికి భంగం లేకుండా ప్రయోగాను కూలంగా ఈ నాటకం వ్రాసారు. నాటకంలోని అంక విభాగం తొలగించి దీనిని గూడ రంగస్థల విభాగం చేశారు. నాటక కథారంభం కణ్వ తీర్థ యాత్రతో ప్రారంభమై మొత్తం 7 అంకాల నాటక కథను నాల్గు రంగాలుగా విభాగం చేసారు. నాటకంలోని పద్యాలు కొంత వచన రూపంగా కనిపిస్తాయి. నాంది ప్రస్తావనలు లేకపోయినా ఆ లోపం కనుపించక నాటకాన్ని రక్తి కట్టించారు. నాటకంలో అక్కడక్కడ వేద మంత్రాలు, ఉపనిషద్వాక్యాలు, సందర్భాను సారంగా వైచిత్ర్య శోభితంగా కథా చమత్కృతికి దోహదం చేశాయి. కణ్వాశ్రమ వాతావరణానికి, కణ్వ శిష్యుల సంభాషణా ధోరణికి అనుసూయా ప్రియంవదల పాత్రోచిత్యానికి చక్కని నీరాజనం పట్టారు.

ఇక వీరి తలవని తలంపు నాటకం కూడా సాంఘిక నాటకమే. 1944 లో వ్రాసారు. 1960 లో ఇది అచ్చయింది. రంగస్థల ప్రదర్శనకు పలుమార్లు నోచుకుంది. సాంప్రదాయక జీవితంలో లబ్ధ ప్రతిష్ఠులయినా, రచనా జీవితంలో వారు అభ్యుదయ మార్గానికి బాటలు వేశారు. ఈ నాటకం నాల్గు రంగాలుగా విభాగమైంది. ఈ నాటకంలో మధు, సుశీల, కళ్యాణి, అప్పయ్య, బాలయ్య పాత్రలు ప్రధాన కథకు మూలకందాలు. వివాహం విషయంలో కళ్యాణి మధులకు, మరో వైపు తండ్రి కుమారులయిన మధు అప్పయ్యలకు మధ్య ఏర్పడిన సైద్ధాంతిక సంఘర్షణ ఇది. కళ్యాణి భవిష్యత్తు విషయంగా సుశీలా మధులు మరో వైపు. కళ్యాణీ మధుల మధ్య ఏర్పడిన సంప్రదాయ సదాచార సంఘర్షణలో రచయిత ఎన్నో మెళుకువలు చూపారు.

ఈ సంఘర్షణలో రచయిత స్త్రీ పురుషుల దాంపత్యంలోని వైశిష్ట్యాన్ని, గార్హస్థ్య ధర్మంలోని గొప్పతనాన్ని విశదం చేసారు. సుఖమయ సంసార జీవితానికి ప్రతీకలు భార్యా భర్తలన్నారు. సంసారాన్ని నావతో పోలుస్తూ, దీనికి గమ్య స్థానాలు నీతి ధర్మాలు పురుషార్థాలన్నారు. సంసారం గుట్టు వ్యాధి రట్టు అని సామెతను అప్పయ్య పాత్ర ద్వారా గుర్తుచేసారు. నాల్గవ దృశ్యంలో భగవద్గీత శ్లోకాల్ని ఉదహరిస్తూ అహంకారానికి ఆస్పదమయ్యే ప్రతి విషయాన్ని పరిత్యజించా లన్నారు. మధు పాత్ర ద్వారా దేశంలో దరిద్ర నిర్మూలన జరగాలంటే స్వచ్ఛంద సేవా సంస్థలు ఏర్పడి బీద సాదలను ఆకట్టు కోవాలన్నారు. ఇది రచయిత ఉద్యమ స్ఫూర్తిని స్పష్టం చేస్తుంది. స్త్రీకి సతీత్వానికి మించింది మాతృత్వం. ఆమె ఆరాధ్య దేవత అంటూ స్త్రీ పురుషుడి జీవన జ్యోతి అనే పవిత్ర భావాన్ని వ్యక్తం చేశారు. నాటకంలో కళ్యాణి నిరాశతో క్రుంగి పోయినా తనలో ఏర్పడ్డ జ్ఞానోదయంతో ఒక లక్ష్యాన్ని ఏర్పరచు కొన్నది. కళ్యాణి బ్రతుకు తన కారణంగా చితికి పోయిందని నిర్వేదానికి గురైన సుశీల కళ్యాణిలో మానసిక పరివర్తన తీసుక రావడం అనే ఈ సన్నివేశాలు నాటకంలో సజీవ సాక్షాత్కారాలు.

మధు పాత్రలో సంఘం వల్ల మనకు కల్గిన ప్రయోజనాన్ని ప్రశ్నించుకోకుండా సంఘానికి మన వల్ల ఏ ప్రయోజనం జరిగిందనే భావాన్ని ఆలోచింప చేస్తుంది నాటకం. నాటకం చిన్నదైనా ప్రేక్షకుల మనో నేత్రాలు తెరిపించి విజ్ఞానోప దేశాలు చేయడం గొప్ప విశేషం. ఈ నాటకంలో నాయకురాలు కావలసిన కళ్యాణి స్థానాన్ని సుశీల ఆక్రమించడం విధి వైపరీత్యమే. విషాదమే పరమార్థం కావలసిన కళ్యాణి జీవితం సుశీల యొక్క సహృదయత వల్ల మోదాంతమయింది. ఈ నాటకంలోని మూడు పాత్రలలో మూడు గుణాల్ని ఆరోపిస్తూ నిరాశావాదిగా కళ్యాణిని, ఆశావాదిగా సుశీలను, మానవతా వాదిగా మధును చిత్రిస్తూ సంఘర్షణలో సామరస్య స్ఫూర్తిని కల్గించిన పులుగుండ్ల వారు చరితార్థులు.

రచయిత సాహిత్య జీవితం నాటక మయమయినా, వారు కథానికలకూడా వచి చూచారు. వీరి సుడిగుండాలు ఓ సాంఘిక కథానిక. ఓ అభాగ్యుని అప్పుల కథ. వెంకట్రాముడు 500 కరపలు గల చేమగుంట కాపురస్థుడు. ఆ గ్రామంలోని రైతు వెంచురామయ్య కమతంలో పేర్యగాడు. అతని వద్ద అప్పు చేసాడు. ఇక జీతమా పూటకూటికి కూడా సరిపోదు. కుటుంబమా పెద్దది. ఇలా సుడి గుండాలతో నిండిన వెంకట్రాముని జీవితం కాల ప్రవాహంలో ఓ కొయ్య మొద్దులా తేలుతుంది. ఈ కథానికలో రచయిత వెట్టి చాకిరీ విధానాన్ని, శ్రామికుల దారిద్ర్యాన్ని, భూస్వాములు చేస్తున్న గ్రామీణ దోపిడిని వర్ణిస్తూ కార్మిక వర్గాల అష్ట కష్టాలకు నిలువుటద్దం పట్టారు.

ఇక వారి గేయ సాహిత్యంలో దిష్టి బొమ్మలు, అనాది ఉగాది, పేదరి కోపం, సంస్మరణ, స్వగతం అనేవి ప్రాముఖ్యాన్ని సంతరించు కొన్నాయి. మొత్తం మీద పరిశీలిస్తే రామకృష్ణయ్య గారి రచనలన్నీ సాంఘిక సంస్కరణో దిష్టమై సంఘంలో జరుగుతున్న లోటు పాట్లను స్ఫురణకు తెస్తూ నేటి సమాజంలో వెర్రి తలలు వేస్తున్న పలు సమస్యలను పాఠక లోకంలో ప్రతిఫలింప జేయడం మెచ్చుకో దగ్గ విషయం.

అట్టి వీరిని నెల్లూరు నాటక సమాజం వారు, కళాసుధ, కీ.శే. శ్రీ ఆర్.ఎల్. రెడ్డి, డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి మున్నగు ప్రముఖులు, రామకృష్ణ మండలి, జిల్లా గ్రంథాలయ సంఘం మున్నగు కళాపోషణ సంస్థలు వారి నాటకాల ప్రదర్శనా సందర్భంలోను, నటనా సందర్భంలోను సన్మానించడం నాటక సాహిత్యానికే జరిగిన సన్మానం జరిగినట్లు భావించాలి.



## జనరల్ నోటీసు

నా కక్షిదారులైన పైకోట లక్ష్మి, పైకోట సాయి సుప్రియ (మైనరు) లు తోటపల్లి గూడూరు మండలంలోని వరిగొండ కాపురస్తులైన పై కోట రమణయ్య కుమారులైన పై కోట చంద్రమౌళికి భార్య, బిడ్డలై యున్నారు. పై వారి జాయింటు కుటుంబపుటాస్తి వరిగొండలోని ఇంటి నెం. 3/52 ఇంటిని, పైకోట చంద్రమౌళి, ఇతరుల పలుకుబడితో, దుర్వ్యసనాలకు లోబడి అన్యాక్రాంతము చెయ్యటానికి తలపెట్టినట్లు తెలుస్తున్నది. ఇది చంద్రమౌళి స్వయార్జితము కాదు. ఆయన పూర్వీకుల ఆస్తి. నా కక్షిదారులు హక్కు భుక్తములు కల్గియున్నారు. దీనిని ఎవరైన కొన్నను, ఇతర విధాల పొందినను అట్టి అన్యాక్రాంతములు నా కక్షిదారులను బద్ధగించవని, అటువంటి ఇతరుల మీద సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకోబడు నని ఇందు మూలముగా ప్రకటించడమైనది.

అన్నదేవుల రామచంద్రా రెడ్డి

నెల్లూరు: 19.9.93

## జనవాణి

(3 పేజీ తరువాయి)

### అన్నా! ఇది నీకు తగునా?

ఎన్టీ రామారావుగారు ఒకప్పుడు తాను రాజర్షి, బ్రహ్మర్షి సర్వసంగ పరిత్యాగినని చెప్పుకొన్నారు. ఇప్పుడేమో ఒక వివాహితను తన వద్ద వుంచుకొని, లోబరచు కొని, ఆమె కాపురం కూల్చి, తన ఆలిగా మార్చుకున్నారు. 'సన్యాసి దుఃఖి -సంసారి సుఖి' అన్న నానుడి 72ఏళ్లలో అన్నగారికి మళ్లీ గుర్తుకు రావడం గొప్ప విషయమే. చేసిన పనికి సిగ్గుపడక పోగా అందరూ అభినందిస్తున్నట్లు ప్రకటనలు ఇవ్వడం ఎన్టీఆర్‌కె చెల్లింది. ఇంత సిగ్గు మాలిన పనికి బరితెగించినా ఆయన్ను తెలుగుదేశం పార్టీలో ఒక్కరూ ప్రశ్నించక పోవడం ఆ పార్టీలో ప్రజాస్వామ్య ధోరణిని ప్రస్ఫుటీ కరింప జేస్తుంది. సకల అవలక్షణాలూ గల వ్యక్తులు నాయకులు కావడం ప్రజల పాలిట శాపమనిపిస్తుంది.

-వి.రవికుమార్

నెల్లూరు

### పన్ను పెంపకం

మునిసిపాలిటీ పరిధిలో పన్ను పెంపకం విధానం చాలా లోపభూయిష్టంగా వుంది. నూరు శాతం పెంచి పన్నులు పెరగ లేదంటూనే 500 శాతం పెరిగినవి కోకొల్లలు వున్నాయి. ఉదాహరణకు స్వతంగా కాపురం చేస్తున్న ఇంటికి ఇంతకు మునుపు 12 వందల రూపాయల పన్నుంటే ప్రస్తుతం 5,173 వేయడం న్యాయమా చెప్పండి? ఏదో కొత్త పద్ధతి అమలు పరుస్తున్నామంటారు. అది ఎంత మాత్రం ఆచరణ యోగ్యమో ఆలోచించరు. ప్రతి మూడు సంవత్సరాల కొకసారి స్వంత ఇంటికి 15శాతం, బాడుగలు వున్నవారికి 25శాతం పెంపుదల చేస్తే యోగ్యంగా వుంటుంది. అభివృద్ధి మాత్రం మునిసిపాలిటీలో 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే'; పన్నులు, వుద్యోగుల జీతాలకే అంకితమై మునిసిపాలిటీలు ప్రజల పాలిట చివరకు భారాలయ్యాయి.

-వామ్మిన సుబ్రహ్మణ్యం

నెల్లూరు

### మంటగలిసిన ప్రతిష్ట

ఎన్టీఆర్ సినీ జీవితం ఎలా వున్నా రాజకీయ జీవితంలో ఆయన తీసుకొన్న నిర్ణయాలలో హర్షించ తగ్గవి కొన్నితలతిక్క నిర్ణయాలు చెప్పలేనన్ని తాజా పెళ్లి నిర్ణయం వయసు ప్రాయాన కులుకు ప్రాయ మన్నట్లుంది. సామాజిక బాధ్యత నెరిగిన వ్యక్తి ఈ హేయమైన పనిని అవశ్యమని చెప్పడం ఆయనకే చెల్లింది. రేపటి ఎన్నికల్లో బంగారు భవిష్యత్తు వుందిన తెలుగుదేశం పార్టీ ప్రతిష్ట మంట గలిసి పోయింది.

—బి.వి. రఘురామమూర్తి

నెల్లూరు

### ఏమిటీ వైపరీత్యం?

ప్రభుత్వ ఆశ్రమ పాఠశాలలో 14 సంవత్సరాల బాలిక గర్భం ధరించడం, ప్రసవించడం, కన్న బిడ్డను ట్రంక్ పెట్లో దాచి పెట్టడం ఒక సినిమాలా వుంది. ఆ బాలికలో కల్గిన సహజ సిద్ధ శారీరక మార్పులు తాము గమనించ లేదన్న పాఠశాల, హాస్టల్ సిబ్బంది ప్రకటన వృత్తి పట్ల వారి కున్న నిర్లక్ష్యాన్ని చూపుతున్నది. ప్రభుత్వ అజమాయిషీలో నడిచే సంస్థలలో బిడ్డలకు రక్షణ ఇంతేనా? చట్టానికి ప్రతినిధియైన ఒక కానిస్టేబిల్ ఈ దురాగతానికి పాల్పడడం క్షమించ రాని నేరం. లోకజ్ఞానం లేని బాలికకు ఈ దుస్థితి కల్పించిన వాడికి ఏ కఠిన శిక్ష విధించినా తక్కువే.

నెల్లూరు —గునుపాటి వేణుగోపాల్

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

### ఎస్.సి. విద్యార్థులకు 8వ తరగతిలో ప్రవేశం

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ రాష్ట్ర స్థాయి కమిటీ తాజాగా జిల్లాలోని నాలుగు పాఠశాలకు గాను ఎస్.సి. విద్యార్థులకు 8 వ తరగతి వరకు ప్రవేశానికి గుర్తింపునిచ్చింది. వీటిలో దర్గామిట్టలోని సెంట్ జోసఫ్ ఇంగ్లీషు మీడియం స్కూల్, రంగనాయకుల పేటలోని సెంట్ పీటర్స్, కావలిలోని సెంట్ ఆన్స్, వెంకటగిరిలోని సెంట్ ఫ్రాన్సిస్ స్కూళ్లు ఉన్నాయి. కాబట్టి చేరగోరు ఆసక్తి గల వారు 30 తేది లోగా దరఖాస్తులు పంపుకోవాలి; ఇవి జిల్లా సాంఘిక సంక్షేమాధి కార్యాలయంలో దొరుకుతాయి.

### ఎ.ఎన్.ఆర్. జన్మదినోత్సవం

ప్రముఖ సినీ నటుడు అక్కినేని నాగేశ్వర రావు జన్మదినోత్సవాన్ని 21 తేది ఇందిరా భవన్‌లో డాక్టర్ అక్కినేని ఇంటర్నేషనల్ కల్చరల్ అసోసియేషన్ ఘనంగా జరిపింది. ఈ సందర్భంగా నిర్వహించిన సినిమా డాన్స్, పాటల పోటీల్లో పెద్ద సంఖ్యలో యువతీ, యువకులు పాల్గొన్నారు. రాత్రి జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభలో మాజీ శాసన సభ్యుడు కె.వి. సుబ్బారెడ్డి, పినాకినీ బేవరేజస్ ఎం.డి. చిదంబరం, ఆర్. పెంచల సింగ్, మాజీ కౌన్సిలర్ పత్తి రవీంద్ర బాబు నిర్వాహకుడు ఎం.డి. బాజాని పాల్గొన్నారు. లలిత సంగీతంలో బి. పద్మావతి, జానపద నృత్యంలో పి. సరోజ, రాధాకృష్ణయ్య, జి. సుప్రజ విజేతలయ్యారు. రికార్డ్ డాన్స్ జూనియర్ విభాగంలో వంశీకృష్ణ, రవిరాజ, అన్నామణి సీనియర్సలో అనుపమ, సరోజ, జనార్ధన్ బహుమతులు పొందారు. విజేతలకు ముఖ్య అతిథి చిదంబరం మెమెంటోలు అందజేశారు.

### గీతా పఠన పోటీలు

చిన్మయా అంతర్జాతీయ ఫౌండేషన్ జాతీయ స్థాయిలో బాల బాలికలకు భగవద్గీతా పఠన పోటీలు నిర్వహిస్తున్నది. 3 నుండి 9 సంవత్సరాల లోపు వారు12 వ అధ్యాయం; 10 - 16 మధ్య వారు 7 వ అధ్యాయం; 17 - 21 మధ్య వారు 11 అధ్యాయంలోని శ్లోకాలను కంఠస్థం చేసి పఠించాలి. ఈ పోటీలు జిల్లా స్థాయిలో అక్టోబర్ 20 - 30 మధ్య, రాష్ట్ర స్థాయిలో నవంబర్ 21 - 31 మధ్య, జాతీయ స్థాయిలో 94 జనవరి 9 తేది జరుగుతాయి. దరఖాస్తు ఫారాలు, వివరాలకు రెండు రూపాయల స్టాంపు అతికించిన స్వంత చిరునామా గల కవర్‌ను ఛీఫ్ నేషనల్ కో ఆర్డినేటర్, చిన్మయా బాల భవన్, కన్నమూర్ — కేరళకు రాసి తెప్పించుకోవచ్చు. ఇతర వివరాలు ఏమైనా కావల్సి వస్తే నెల్లూరు చిన్మయా మిషన్ అధ్యక్షుడు కొండా బలరామిరెడ్డిని అడిగి తెలుసుకోవచ్చు.

### నెల్లూరులో టైలర్స్ డే

టైలర్స్ డే ను పురస్కరించుకొని 26 తేది శ్రీ మూలస్థానేశ్వర ఆర్ట్స్ సహకారంలో రాష్ట్ర స్థాయి సాంస్కృతిక పోటీలను నిర్వహిస్తున్నారు. సినిమా పాటలు, లలిత సంగీతం, అన్నమాచార్య కీర్తనలు పోటీల్లోని అంశాలు. స్త్రీ, పురుషులకు వేరుగా నిర్వహిస్తారు. ఎంట్రీలు 25 తేదిలోగా శ్రీ మూలస్థానేశ్వర ఆర్ట్స్ 24/574, రాజావీధి, మూలపేట, నెల్లూరు - 3 చిరునామాకు పంపాలి. 26 తేది టౌన్ హాల్‌లో జరిగే బహుమతి ప్రదానోత్సవ సభలో ఎస్పీ కృష్ణ ప్రసాద్, ఎం.పి. పద్మశ్రీ, ఎమ్మెల్యే జె.కె. రెడ్డి టైలర్స్ యూనియన్ కార్యవర్గం పాల్గొంటుందని నిర్వాహకుడు సి.హెచ్. చంద్రయ్య తెలుపుతున్నారు.

### ఉత్తమ ఉపాధ్యాయునికి సన్మానం

జాతీయ స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ రొంపిచెర్ల సుబ్రహ్మణ్యంను టౌన్‌లోని నూతన సంస్థ సింహపురి ఆర్ట్స్ అండ్ రిక్రియేషన్ క్లబ్ (సార్క్) 18 తేది టౌన్ హాల్‌లో సత్కరించింది. ముఖ్య అతిథులుగా జిల్లా ఇన్‌ఛార్జి విద్యాధికారి ఆర్. నాగేశ్వర రావు, అవార్డు గ్రహీత పి.ఎం.ఆర్. హై స్కూలు హెడ్‌మాస్టర్ శ్రీ వై. శ్రీనివాస రావు విచ్చేశారు. సుబ్రహ్మణ్యం గారు అంకిత భావం గల ఉపాధ్యాయులనీ, కృషి, పట్టుదల, వృత్తి పట్ల నమ్మకమే ఆయనకి అవార్డు తెచ్చి పెట్టాయని, ఈ విషయాన్ని ఉపాధ్యాయులు ఆదర్శంగా తీసుకోవాలని విద్యాశాఖాధికారి కోరారు. కార్యక్రమంలో సార్క్ సంస్థకు చెందిన ఎస్.వి. కోటారెడ్డి, బి. మనోహర్, రిటైర్డ్ డిప్యూటీ డి.ఇ.ఓ. రంగారావు పాల్గొన్నారు. పలువురు విద్యార్థులు కూడా సుబ్రహ్మణ్యంను సన్మానించి తమ గురు భక్తి చాటుకొన్నారు. చివరన ఏర్పాటు చేసిన బాలరాజు మిమిక్రీ చక్కగా వున్నింది.

## చిత్రసమీక్ష

(9 పేజీ తరువాయి)

చిలిపిలు పలవలు చేర్చారు. కాని అవి చిట పట పేల లేదు. పేలవంగా తయారయ్యాయి. దర్శకత్వం మీద గౌరవ భావం కనిపించదు. ఏదో మొక్కుబడిగా తట్ట తగలేసినట్లు ఏవో కొన్ని సన్నివేశాలు వెలగబెట్టి ఎలాగో చిత్రం పూర్తి చేశామనే ఒక సాధారణ లక్షణం దర్శకత్వంలో కనిపిస్తుంది. ఇది ఏ దర్శకునికి శుభ లక్షణం కాదు.

కృష్ణ, రంభల ప్రేమాయణం, కృష్ణ ఫైటింగులు, సిల్క్ స్మిత సెక్సు, బాబూమోహన్ హాస్యం, నటీనటుల మంచి నటన బాబు ఫోటోగ్రఫీ చిత్రానికి కొంత చైతన్యం కలిగించాయి. కృష్ణ చాలా వరకు ప్రేక్షకులను చిత్రం చూసేట్టు చేస్తారు. భువన చంద్ర పాటలు, విద్యాసాగర్ సంగీతం రుచిగా లేదు. చిత్రం మొదటి భాగం నీరసంగా సాగి, రెండో భాగంలో కొంచం ఉత్సాహం పుంజుకుంటుంది.

## సినిమా

(9 పేజీ తరువాయి)

రాణించారు. నేను రాజకీయ రంగం నుంచి సినిమారంగానికి వెళ్లడమా - అని ఆలోచిస్తుండగా మా ఆవిడ "ఒప్పుకోండి తప్పేముంది? మీకు మరింత పేరు ప్రఖ్యాతులొస్తాయి." అని ఎంతగానో చెప్పింది. కాని, నేను ఒప్పుకో లేదు. వారం రోజుల తర్వాత ఒక మంత్రిగారికి ఈ విషయం చెప్తే, "అరే! వచ్చిన అవకాశాన్ని ఎందుకు జారవిడుచు కున్నావ్? నటించడానికి నీకు ఇష్టంలేక పోతే, ఆ నిర్మాతలను మా ఇంటికి పంపించి ఉండకూడదా!నేనైనా యాక్ట్ చేసి ఉండేవాడ్ని కదా? మంచి ఛాన్స్ పోయిందే!" అని బాధ పడ్డారు. సినిమాలంటే కొందరు రాజకీయ వేత్తలకు సైతం అంత మోజా -కామోసు." అని పాండ్యన్ ఇటీవల పాత్రికేయులకు తెలియజేశారు.

# యానాదిరెడ్డి పర్యటన ఆడంబరంగా జరిగింది!

* యానాది బావా - మంత్రయ్యానని సంబరపడ బాకు, ఎందరితో తగువులో స్తాయో జాగ్రత్తపడు.

– జానకీ రాం హితోక్తి

* నీకు మంత్రి కావాలనే కోరిక వుంటే నేనే ఇచ్చి వుండేవాడినని జనార్దన రెడ్డి చాల్తీ పడ్డాడు.

– వేమారెడ్డి చురక

* ఆనం సంజీవ రెడ్డి మధ్యలోనే వెళ్లి పోవడం విచారకరం

– మంత్రి ఆవేదన

మంత్రిగా కలిక యానాది రెడ్డి గారి తొలి జిల్లా పర్యటన జగజ్జగేయ మానంగా జరిగి పోయింది. 17 తేది ఉదయం నెల్లూరు వచ్చి, 23 తేది రాత్రి తిరిగి వెళ్లారాయన.

ధార్మినార్ ఎక్స్‌ప్రెస్ మూడు గంటలు ఆలస్యంగా నెల్లూరు చేరి- కావలి నుంచి కార్లు, బస్సులు, లారీలలో వచ్చిన జనం స్టేషన్‌లోనే ఆయన్ను పూలమాలలతో ముంచెత్తారు; అరుణంధి అతిథి గృహంలో ప్రథమ కిష్యుడు అల్లూరు విష్ణు ఉదయాతిథ్యం; కళ్యాణి ఫిలింస్, ఆనం వారి రెండిళ్లలో అటెండెన్సు వేసుకున్నారు. నవయుగం ప్రెస్‌లో స్వర్గీయ జి.సి. కొండయ్య పటానికి శ్రద్ధాంజలి ఘటించారు; జమీన్‌రైతు కార్యాలయం సందర్శించారు. మధ్యాహ్నం జెక లంచ్. జెక చేతితో ఏ మంత్రికి భోజనం పెట్టినా అచ్చి రావడం లేదు. తగువు తరుముకొని వచ్చేస్తున్నది. యానాది రెడ్డి గారి విషయంలో ఆ ప్రమాదం కల్గకుండా శివుడు కాపాడుగాక!

మధ్యాహ్నం కావలి - ఢిల్లీ నుంచి ఆశీర్వాదం, శివార్చనలతో పుర ప్రవేశం చేశారు. తన ఇంట్లో తేనీరు అన్నదుర్గంచి ఎరిఎం హై స్కూలు కాంపౌండ్ వరకు టాప్ లెస్ జీపులో ఊరేగింపు. బెల్లుతో కావలి దద్దరిల్లింది. బానంతటినీ అలంక రించారు. కరెంట్ దీపాల తోరణాలు కళ్లు జిగేల్మనిపించాయి. రాజా వెడలె రవి తేజము లరయగ అన్నట్లు మంత్రి గారు వేదిక పైకి వస్తుంటే చప్పట్లు

## కావలి దద్దరిల్లింది!

తాళాలు కప్పు లేచి పోయేటట్లు మ్రోగాయి.

సభాధ్యక్షులు శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి, ఆనం సంజీవ రెడ్డిని అధ్యక్ష స్థానంలో కూర్చో మన్నారు కాని ఆయనెకరి ముళ్ల కుర్చీ వలె కన్పించి వద్దను గాక వద్దు పొమ్మన్నాడు. సభ అయిందాకా కూడా వుండలేదు. ఉపన్యాసాలు బహిరంజాగా వుండినాయి. "యానాది రెడ్డి ఎప్పుడో మంత్రి కావలసిన వాడు. అదృష్టం కలిసి రాలేదు మంత్రి అయిన తర్వాత జనార్దన రెడ్డి దగ్గరకు వెళ్తే - నీకు మంత్రిత్వం కావాలని నాతో ఒక్క మాట కూడా చెప్పలేదే - నన్నడిగితే నేనిచ్చే వాణ్ని కదా - అని చాల్తీ పడ్డాడు. ఆయన ఇష్టానంటే ఈయన వద్దంటాడా" అన్నారు వేమారెడ్డి. ఈ చురకలోని మర్మమేమిటో ఈ విలేఖరి బోటి మంద బుద్ధులకు అర్థమై చస్తే కదా!

మాజీ మంత్రి శ్రీ మాదాల జానకి రాం - "యానాది బావా, మంత్రి అయిపోయానని సంబర పడబాకు, ఆయిన దగ్గర నుంచి నిన్ను అప్పులన్న వారే కాల్చుక తింటారు. ఈ వేదిక పై నున్న వెంకటేశ్వర చౌదరి వంటి వారు నిన్ను ప్రజలకు కాకుండా చేస్తారు, ఫోను కనెక్షన్ కూడా ఇవ్వకుండా జనం చేత తిట్టిస్తారు. నాకేమి చేశావు అని స్నేహితులు, బంధువులు నిన్ను ప్రశ్నించి దూరమై పోతారు" అని పారాహుషార్ చెప్పాడు. జానకిరాంనకు ఎంత గట్టి స్వంత అనుభవం లేనిదే ఇంతగా మాట్లాడి వుంటాడో పాపం! అల్లూరు విష్ణు యానాది రెడ్డి గారి ఎగిరే పంచ, ఎరిగిన కళల గురించి మాట్లాడారు. ఎమ్మెల్యేలు జెక, సిపి, వత్రా, డాక్టర్ సుందర రామిరెడ్డి, ఎమ్పి పద్మశ్రీ మాట్లాడారు.

యానాది రెడ్డి గారి ప్రసంగం జీవిత సింహావలోకనం వలె వుండింది. సర్పంచ్‌గా రాజకీయాలు మొదలై నప్పటి నుంచి నేటి వరకు ముఖ్య ఘట్టాలన్ని ప్రస్తావించారు. జనార్దన రెడ్డి గారిని ఒక ప్రక్క పొగుడుతూనే; ఆయన తల్చుకొని వుంటే తనకు ఎప్పుడో మంత్రిత్వం వచ్చి వుండేదని నిష్ఠూర పడ్డాడు. ఆనం సంజీవ రెడ్డి సభ మధ్యలో వెళ్లి పోవడం పట్ల బాధ పడ్డారు. భారత కమ్యూనిస్టు పార్టీ తరపున న్యాయవాది శ్రీ పి.వి. నరసింహా రావు మంత్రికి వినతి పత్రం సమర్పించాడు శ్రీ భుజంగరాయ శర్మ గారూ మాట్లాడారు.

18 నుంచి 23 తేది వరకు కావలిలో యానాది రెడ్డిని సన్మానాల పేరిట నలిపి పారేశారు. హౌస్ బిల్డింగ్ కో ఆపరేటివ్ సొసైటీ, అన్నపూర్ణ, నవోదయ, అరుణోదయ క్లాత్ మర్చంట్సు కాంప్లెక్స్ వర్తకులు, కావలి పిటి సెంటర్లు, జవహార్ భారతి, కావలి సేవా సమితి, పారీ పంజిక్, అది ఇది అని ఏమి - కావలిలోని ప్రతి ఒక్కరూ, ప్రతి సంస్థా కొత్త మంత్రిని సన్మానించాయి. వర్తకుల సభలో అయితే పూల మాలల గుట్ట యానాది రెడ్డిని గారి ఎత్తును మించి పోయింది.

ఈ పత్రికకి అనారోగ్యం తిరగ బెట్టి నప్పటికీ మంత్రి గారు టౌన్‌లోని హరిజన, గిరిజన, అరుంధతీయ వాడలు సందర్శించారు. మంచి నీళ్ల బోర్లు వేసే చోట్లు చూశారు. కావలి కాలువ పనులు పరిశీలించారు. ప్రెస్ కాన్ఫరెన్స్‌లో మాట్లాడారు. ప్రతిపక్ష నాయకులను కలిశారు. పలు సమస్యల పై హామీలిచ్చారు.

ఇతి యానాద మాత్య సింహపురీ మండల సందర్శనా సవిస్తర సమాచార కథనం సమాప్తి.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,